## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035072

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నే నెరిగిన మహాత్మ గాంధి

రచన

ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
[ ఆంధ్రప్రదేశ్ గాంధీస్మారకనిధి ]
హైదరాబాదు-20

# ప్రకాశకుల నివేదన

గాంధీజీ సన్నిహిత సంబంధంగల ప్రముఖులు చాలామంది ఉండేవారు. వారికి ఆయనతోగల వ్యక్తిగత సంబంధంవల్ల లోకానికి వెల్లడిగాని అనేక ఆసక్తికర విషయాలు వారికి తెలిసియుండేవి. ఆ తరంవారిలో చాలామంది ఇప్పటికే గతించారు. మిగిలినవారు చాలా స్వల్పం. వారికి తెలిసిన విషయాలైనా గ్రంథస్థంచేసి, ఆంధ్రలోకానికి తెల్పడం అవసర మని, గాంధీ సాహిత్య ప్రచురణాలయం తలచింది. కొంతమంది ప్రము ఖులను అర్థించాము. వారిలో మొదట మాకు సమాధానం అందజేసినవారు శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు. వీరు గాంధీమహాత్ముని శంఖారావం విని, సహాయనిరాకరణోద్యమంలో దుమికి, తదాది తమ జీవితాన్ని హిందీ ప్రచారోద్యమానికి ధారబోశారు. చిరకాలం ఈ నిర్మాణ కార్యరంగంలో వుండి, బాపూజీకి భక్తులైనారు. వ్యక్తిగతపరిచయంతోపాటు, వీరు బాపూ జీతో ఉత్తరప్రత్యుత్తరాలుకూడా జరిపారు. బాపూజీతో తమకు గల సంబంధాన్ని ఈ పుస్తకరూపంలో వెలువరించారు.

ఈ పుస్తకపరంపరను వెలువరించడంలో అనేక సాధకబాధకా లున్నవి. విషయము, గాంధీజీతో వారికిగల పరిచయం. కాబట్టి వారివారి జ్ఞాపకాలు, భావాలు, అభిప్రాయాలు రకరకాలుగా వుండటం సహజం. ప్రకాశకులు వాటిలో కలుగజేసుకొనటం ఉచితంగా ఉండదు. అందుచేత వారి వ్రాతలను యథాతథంగా ప్రచురించుచున్నాము.

ఇది ఈ పరంపరలోని తొలి పుస్తకం కావటంతో అనేక లోపా లుండటం సహజం. పాఠకలోకం దీనిని చదివి తగు సూచనలు ఇస్తే ముందు పుస్తకాలలో అట్టి లోపాలు దొర్లకుండ వుండగల ప్రయత్నం చేస్తాము.

మా లోపాన్ని మన్నించి ఈ పుస్తకము వ్రాసిన శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారికీ, దీనిని పరిశీలించిన పెద్దలు కొడాలి ఆంజనేయులుగారికీ, ముద్రాపకులు సర్వోదయ ముద్రణాలయం వారికీ మా కృతజ్ఞత.

ఇట్లు,
కోదాటి నారాయణరావు
కార్యదర్శి
సంపాదక సమితి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
హైదరాబాదు-20
22—7—1969

# విషయసూచిక



మహాత్మ గాంధీతో గ్రంథకర్త శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

# నేనెరిగిన మహాత్మ గాంధి

## ప్రస్తావన

"పవిత్ర గంగానది ప్రవహిస్తూ పోతున్నది. కొందరు భక్తిశ్రద్ధలతో అందు స్నానమాడి పునీతులగుచున్నారు. ఎవరియందు ఎంత భక్తి, శ్రద్ధ, సంస్కారము ఉండునో వారు అంత మేరకే పవిత్రులగుచున్నారు. అలాగే మహాత్మా గాంధీయను పవిత్రగంగానదీ ప్రవాహమునుండి వారివారి భక్తిశ్రద్ధలనుబట్టి ఫలము పొందుచున్నారు. నేను ఎక్కువ ఫలము పొందజాలనిచో అది నా దురదృష్టమే యనవలెను." ఇవి 'భారతరత్న' డాక్టర్ రాజేంద్రప్రసాదుగారి మాటలు.

బాబూ రాజేంద్రప్రసాదు అంతటివారే గాంధీమహాత్ముని గూర్చి తెలిసికొన్నదీ, గ్రహించినదీ, వారిని అనుసరించినదీ అల్పమని భావించినపుడు అల్పజ్ఞానము, అత్యల్ప శక్తిసామర్థ్యములు గల నేను ఎంత గ్రహించగలను? మహాత్ముని జ్ఞానము, భక్తి, శక్తి, సేవాపరాయణత అపారము. నేను వారినిగురించి వ్రాయబూనుట సాహసమే.

ఆంధ్రప్రదేశ్ గాంధీస్మారకనిధివారి ప్రోత్సాహమున ముఖ్యముగ సంస్థకార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావు గారి ప్రోద్బలముచే ఈ గ్రంథము వ్రాయబూనితిని. వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

నేను నా శక్తికొలది, మహాత్మగాంధీగారిని అర్థము చేసికొనుటకును, వారి కార్యకలాపములను తెలిసికొనుట

కును, వారి జీవిత పరమార్థమును గ్రహించుటకును కొంత ప్రయత్నించితినని సవినయముగ పాఠకులకు మనవి చేసికొను చున్నాను.

శ్రీ మహాత్మగాంధీగారిని దర్శించియు, వారి ఉపన్యాసములు వినియు, వారి రచనలు కొంతవరకు చదివియు, ధర్మ సందేహములు కలిగినపుడు వారిని కలుసుకొని వారి ముఖతః ఆ సందేహములను తీర్చుకొనియు, వారికి అప్పుడప్పుడు ఉత్తరములు వ్రాసియు, వారి సిద్ధాంతములను ఆశయములను తెలిసికొనుటకు ప్రయత్నించితిని.* ఈ పుస్తకమునందు మహాత్మగాంధీగారి సిద్ధాంతములను విశదీకరించుటకు ప్రయత్నించితిని. వారి ధర్మమును జీవితాదర్శమును పాఠకులు స్పష్టముగ తెలిసికొనుటకై వారువ్రాసిన వ్యాసములనే అక్కడక్కడ పొందుపరచితిని. ఆ వ్యాసములలో కొన్ని వారు నలభై, నలభై ఐదు సంవత్సరముల క్రిందట వ్రాసినవి. అవి ఇప్పుడు ఎంతయో ఉపకరించగలవు.

జాతిపిత గాంధీమహాత్ముని సందేశములను, సిద్ధాంతములను పాఠకులకు విపులముగ తెలుపుటయే ఈ గ్రంథ లక్ష్యము. ఈ లక్ష్యము నెరవేరినచో నేను ధన్యుడను. ఈ పుస్తకమును సహృదయముతో పరిశీలించిన శ్రీ కొడాలి ఆంజనేయులుగారికి నే నెంతయు కృతజ్ఞుడను.

---

* వారి రచనలు, ముఖ్యముగ 'గీతాబోధ'ను తెలుగు అనువాదము చేయునపుడు కలిగిన సందేహములుకూడ వారికి వ్రాసి ఆ సందేహములు తీర్చుకొంటిని.

# 1

## పూర్ణపురుషుడు మహాత్మ గాంధి

భారతదేశములోనేమి ఇతరదేశములలోనేమి పలువురు మహాపురుషులు, ధర్మప్రవక్తలు, మత సంస్థాపకులు, విజ్ఞానవేత్తలు, సంఘసంస్కర్తలు జన్మించి తమతమ దివ్య సందేశములద్వారా ప్రజల నుద్ధరించుటకు కృషి సలిపిరి. కొందరు ఆధ్యాత్మికవేత్తలుగను, కొందరు ఆర్థికవేత్తలుగను, మరికొందరు రాజకీయవేత్తలుగను ఆయా క్షేత్రములందు మాత్రమే కృషిచేసి తమ దేశాభ్యుదయమునకు, తద్వారా ప్రపంచ పీడిత జనోద్ధరణకు తోడ్పడిరి. కాని, మహాత్మ గాంధీగారు దేశముయొక్క సర్వతోముఖాభ్యుదయమునకై ఆధ్యాత్మిక, ఆర్థిక, రాజకీయ, సాంఘికాది రంగములలో నిర్విరామముగ కృషిచేసి భారతదేశమునకు 1947 ఆగష్టు 15 వ తేదీన స్వరాజ్యమును సంపాదించిరి. అహింసాయుత సత్యాగ్రహ సమరముద్వారా స్వరాజ్యమును సంపాదించుట ప్రపంచచరిత్రలోనే అపూర్వమగు విషయము. ఇన్ని రంగములలో కృషిచేసి దేశాభ్యుదయమునకు తోడ్పడిన మహాపురుషులు ప్రపంచములోనే మరొకరు లేరని చెప్పవచ్చును.

మహాత్మ గాంధీగారు నాలుగు వర్ణాశ్రమధర్మములను చక్కగ అనుష్ఠించిరి. బ్రాహ్మణునకు ఉండవలసిన బ్రహ్మజ్ఞానము వారికి కలదు. క్షత్రియునకు ఉండవలసిన శౌర్య ధైర్య పరాక్రమాది గుణములు వారికి కలవు. నిర్భయత్వము వారిసొత్తు. వైశ్యధర్మమయిన గోసేవ, ఖాదీవ్యాప్తి

పరిశ్రమాభివృద్ధి మొదలగు వ్యాపారములద్వారా ధర్మబద్ధ మయిన ఆర్థికాభివృద్ధికి కృషిచేసిరి. ఇక సేవాధర్మమునకు వారు తమ జీవితమునే అంకితము చేసిరి.

బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసాశ్రమ ధర్మ ముల నాలుగింటిని వారు పాటించిరి. అందుకనే మహాత్మ గాంధీగారిని పూర్ణపురుషుడని అంటున్నాము.

**పురుషార్థములు :**

ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థము లను మహాత్మ గాంధీగారు జీవితములో అనుష్ఠించి సాధిం చిన మహాయోగి. వారి రాజకీయ జీవితము ధర్మయుక్తమయి నది. రాజకీయములకు, ధర్మమునకు పొత్తు లేదనుకొను నాటి కాలములో సత్య అహింసాయుతమయిన సత్యాగ్రహ సమ రముద్వారానే భారతదేశమునకు స్వరాజ్యము సంపాదించు టలో అహర్నిశము పాటుపడి చివరికి స్వరాజ్యమును సంపా దించినారు. గాంధిగారు చూపించిన సత్య, అహింస మార్గ మున వారి అనుయాయులమని చెప్పుకొను మనము, నడచు టకు ప్రయత్నించినచో నేడు మన రాజకీయములు ఇంత కలుషితములయి ఉండెడివి కావు. భారతదేశము ప్రపంచ ములో మహోన్నత స్థానము పొందియుండెడిది.

గాంధీగారి అర్థనీతి ధర్మసమ్మతమైనది. "సర్వేజనా స్సుఖినోభవంతు" అను ఆశయమును నెరవేర్చునది. స్వార్థ పరత్వమును భోగలాలసతను పెంచుకొనుటకు వారి అర్థనీతిలో అవకాశమే లేదు. పరపీడనకు తావులేదు. ధనసంపాదనలో

మోసమునకు, అసత్యమునకు స్థానములేదు. వారు సామాన్య గృహస్థుగ వకీలువృత్తి చేసినను సత్యమును విడనాడలేదు. సత్యమందు, ధర్మమందు విశ్వాసముతో ఏ వృత్తి చేసినను ఆ వృత్తిలోనే సాఫల్యము లభించునని వారు ఆచరణద్వారా నిరూపించిరి. కామమనగ ఇంద్రియలోలత్వమును పెంచునది కాదు. ధర్మబద్ధమయిన కామము మోక్షప్రాప్తికి సాధనముగ నుండును. ఇదే చతుర్విధ పురుషార్థములలోని తత్త్వము. ఈ తత్త్వమును సక్రమముగ జీవితమున అనుష్ఠించి మహాత్మ గాంధి మానవమాత్రులకు మార్గదర్శకులైనారు.

# 2

## జీవితాదర్శము

మహాత్మ గాంధి తమ స్వీయచరిత్రను "My experiments with Truth" (నా సత్యపరిశోధనలు) అను పేరుతో ఆంగ్లభాషలోను, 'ఆత్మకథ'యను పేరుతో గుజరాతీ, హిందీ భాషలలోను ప్రప్రథమంగా ప్రచురించిరి. ఈ ఆత్మకథను వారు 1926 వ సం॥లో ప్రారంభించి "Young India" (యంగ్ ఇండియా) అను ఆంగ్ల వారపత్రికలోను, 'నవజీవన్' అను గుజరాతీ, హిందీ వారపత్రికలలోను ప్రతివారము ఒకవ్యాస రూపమున ప్రచురించుచుండెడివారు. పైమూడు పత్రికలు మహాత్మ గాంధిగారి సంపాదకత్వముననే వెలువడుచుండెడివి. తదుపరి ఈ 'ఆత్మకథ' అన్ని భాషలలోను ప్రచురింపబడెను.

ఈ 'ఆత్మకథ' ప్రస్తావనలో గాంధీజీ తమ జీవితాదర్శమును గురించి ఇట్లువ్రాసిరి.

"నా రాజకీయ ప్రయోగములను భారతవర్షమంతయు నెఱుగును. కొంతవరకు సభ్యప్రపంచమంతయు నెఱుగును. నా బుద్ధిలో దీనివిలువ చాలా తక్కువ. ఈ సత్యశోధనవలన నాకు 'మహాత్మ' బిరుదమువచ్చినది. నే నీ బిరుదమునకు అర్హుడనుకాను. 'మహాత్మ' అన్న ఈ విశేషణము పలుమారులు నాకు మిగుల దుఃఖము కలిగించెను. ఈ విశేషణము వలన నే నెన్నడును ఉప్పొంగిపోలేదు. నా ఆధ్యాత్మిక శోధనలు తెల్పుట నా కిష్టము. ఇవి నాకొకనికే తెలియును. వీని వలననే రాజకీయరంగమున నాకు శక్తికలెను——...వీనిని వర్ణించుటవలన వినయము వృద్ధియగుటకే వీలుకలదు. నేను విచారించుకొలదిని, నా గత జీవితమును పరికించిన కొలదిని నా యల్పత్వమే నాకు మఱింత స్పష్టముగ కన్పించుచున్నది. గడచిన ఈ ముప్పది యేండ్లనుండియు నేనుచేసిన ప్రతిపనీ ఆత్మదర్శనముకొఱకును, ఈశ్వర సాక్షాత్కారము కొఱకును మాత్రమే. నా జీవితమందలి ప్రతిపనియు ఇందులకే. నామాటలు వ్రాతలు ఇందులకే. రాజకీయరంగమున నేను దుముకుటయు నిందులకే.

"ఒకనికి శక్యమైన పని అందరకును శక్యమగునని నా చిరవిశ్వాసము. కావున నా శోధనలు చీకటింట జరుగలేదు, ఉండనూలేదు. వీనినందరునూ తెలిసికొని పోవుదురని కొందరందురు. ఇందువలన ఆధ్యాత్మిక గౌరవము తగ్గునని నే తలపను. మనకును, మన అంతర్యామికిని మాత్రము తెలిసిన విషయములు కొన్నియుండును. కాని వానిని వర్ణించుట నా శక్తికి మించినపని. నా ప్రయోగములందు ఆధ్యాత్మి

కములనగా నైతికములు. ధర్మమున కర్థము నీతి. ఆత్మ దృష్టితో ఏనీతి పాలింపదగినదో అది ధర్మము. కావున ఈ కథయందు పిన్నలును, పెద్దలును గ్రహించగలిగిన విషయసంగ్రహ ముండగలదు. నేను రోగరహితుడనై వినమ్ర భావముతో ఈకథను వ్రాయగల్గితి నేని శోధనమార్గానుగాము లగు ఇతరులకిందు దారిబత్తెము దొరకగలదు.... ...

"సత్యమే నా కన్నిటికన్న దొడ్డది. మరియు దీని యందు పెక్కువస్తువుల సమావేశముకలదు. ఆ సత్యము స్థూలముగా వాక్సత్యమే కాదు. భావసత్యముకూడ. ఆ సత్యము కేవలము అస్మత్కల్పనాగత సత్యమే కాదు; అది స్వతంత్రము. సనాతనము. అనగా సాక్షాత్ పరబ్రహ్మము.

"పరబ్రహ్మమునకు లక్షణము లనేకము లుండును. ఏల ననగా తద్విభూతులనేకములు. విభూతులు నన్నాశ్చర్య చకితుని జేయును. ఒక్కొక్కక్షణము నన్ను ముగ్ధుని జేసివైచును. నేను సత్య స్వరూపుడగు పరమేశ్వరుని పూజారిని. అతడొకడే సత్యము. మిగిలినదంతయు మిథ్య. ఆ సత్య మింతవరకు నాకు దొరకలేదు. నేను శోధకమాత్రుడను. ఈ యన్వేషణమున నా ప్రియతమ వస్తువులనుగూడ విడనాడగలను. నేనీ శోధన యజ్ఞమున నా శరీరమునుగూడ హోమముజేయ సంసిద్ధుడను. ఇంతియకాక, ఇంతశక్తికూడ నాకు కలదనియే నా నమ్మిక. ఇంకనెంతవరకు నాకీ సత్యము సాక్షాత్కరించదో, అంతవరకు నాయంతరాత్మ దేనిని సత్యముగా దలచునో, ఆ కల్పితసత్యమును ఆధారముగ గణించి, దీపస్తంభ

ముగ జేబూని దాని యాశ్రయమున నా జీవితము వెడలింతును.

"ఇది కత్తిమీద సామైనను నా కతిసరళముగా కన్పించుచున్నది. ఈ మార్గమునబోవుచుండగా భయంకరములగు నా తప్పిదములును కడుతక్కువగా కాన్పించుచున్నవి. ఏలయన, నేనిన్ని తప్పిదములలో నున్ననూ రక్షింపబడుచుంటిని. ఇకముందు కూడ నేనీదారినే పోగలను. దవ్వుదవ్వుల విశుద్ధమగు సత్యముయొక్క - పరమేశ్వరునియొక్క - మెరపుకూడ కాన్పించుచున్నది. ఈసృష్టిలో ఒకటియే సత్యము. మిగిలినదంతయు మిథ్యయను నీ నమ్మిక నానాటికి పెరుగుచున్నది. ఈ నమ్మిక ఏచందమున బెరిగినదో నా ప్రపంచము -అనగా నవజీవనాది పత్రికాపాఠకగణ మెఱుగును. మరియు ఈ ప్రయోగములందు నాకెవరు సబ్రహ్మచారులో వారునూ నాతోపాటు దీని మెఱపును కన్గొందురుగాక."

ఈ ప్రస్తావనలో గాంధీజీ తమ జీవితలక్ష్యమేమో స్పష్టముగా విశదీకరించినారు. ఆత్మదర్శనమే - ఈశ్వర సాక్షాత్కారమే - తమ జీవితధ్యేయమని వ్రాసినారు. నేను దీనిని 1926 సం॥ లోనే హిందీ 'నవజీవన్' పత్రికలో చదివితిని. ఆ దినములలో ప్రతివారము వెలువడు హిందీ నవజీవన్ పత్రిక శ్రద్ధగా చదువుచుండెడివాడను. ఇది చదివిన పిదప గాంధీమహాత్ముడు భగవంతుని ఏ రూపములో దర్శించగోరుచున్నాడో, ఏరూపంలో ఈశ్వరదర్శనము వారికి కల్గుచున్నదో తెలుసుకొనవలయునను జిజ్ఞాస నాకు గాఢముగా కల్గినది. నేనపుడు కృష్ణాజిల్లా కానుమోలు గ్రామములో

హిందీ ప్రచారము చేయుచుంటిని. మహాత్మగాంధీని కలుసు కొనుటకు అహమ్మదాబాద్ సబర్మతీ ఆశ్రమమునకు వెళ్ళు టకు తగిన అవకాశము నాకు లేకుండెను. భగవంతుని స్వరూప మెట్టిదియను జిజ్ఞాసమాత్రము తీవ్రమగుచుండెను. అప్పు డప్పుడు మహాత్మగాంధి నాకు స్వప్నంలో కన్పించేవారు. కాని నా సందేహమును గురించి ప్రశ్నించులోపలనే నాకు మెలకువవచ్చెడిది. ఇట్లు నాసందేహము సందేహముగానే నిలచిపోయినది.

## 3

## గాంధీజీతో నా ప్రథమ సంభాషణ

1927 సం॥ డిసెంబరు నెలలో మద్రాసులో అఖిల భారత కాంగ్రెసు మహాసభ డాక్టరు అన్సారీగారి అధ్యక్షతన జరిగెను. ఆ మహాసభకు మహాత్మగాంధి, పండిత మదన మోహన మాలవ్యా, పండిత మోతీలాల్, జవహర్లాల్ నెహ్రూలు, వల్లభభాయి పటేల్, బాబు రాజేంద్రప్రసాద్ మొదలగు ప్రముఖ నాయకు లందరు వేంచేసిరి. మహాత్మ గాంధీగారికి, వారి అనుచరులకు, మద్రాసులో పూనమల్లి హైరోడ్డులోనున్న ఒక భవనములో బస ఏర్పాటుచేసిరి. నేను ఆ రోజులలో మచిలీపట్టణములోని ఆంధ్ర జాతీయ కళాశాలలో హిందీ అధ్యాపకునిగా పనిచేయుచుంటిని. శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు ఆంధ్రజాతీయకళా శాల ప్రిన్సిపాలుగా పనిచేయుచుండెడివారు. వారు ఆ సంవత్స రమే కళాశాల ప్రిన్సిపాలు పదవికి రాజీనామాయిచ్చి మద్రా

సులో 'త్రివేణి'యను ఆంగ్లసాహిత్య మాసపత్రికను స్థాపించిరి. నేనునూ మద్రాసు వెళ్ళితిని. నా మద్రాసు ప్రయాణోద్దేశ్యము ముఖ్యముగా గాంధీజీనిదర్శించి నా సందేహనివృత్తి చేసుకొనుటయే. తీరా మద్రాసు వెళ్ళినపిదప మహాత్ముని దర్శించుటెట్లు ? మహానాయకులకే వారి దర్శనము దుర్లభము. అట్టియెడ నాబోటి యల్పునికి అదెట్లు సాధ్యము ? దూరముగ వారిని చూచినను వారితో సంభాషించుట యెట్లనునది యొక జటిల సమస్యగా తయారైనది. ఏ రాజకీయ నాయకులనో మహాత్మునితో సంభాషణావకాశము కల్పించమని కోరుదమన్న, 'నీవేమి ? మహాత్మునితో భాషించు రాజకీయములేవి ?' యని పరిహసింతురను భయము. అయిననూ మహాత్ముడు బసచేసిన భవనమును తెలిసికొని వెళ్ళితిని. లోనికి ప్రవేశమెట్లు కల్గునాయని యోచించుచు భవన ప్రాంగణమున తిరుగాడుచుంటిని. ఇంతలో నాతో హిందీ ప్రచారక విద్యాలయములో సహపాఠిగానున్న కేరళమిత్రుడు ఆ భవనముముందు కన్పించినాడు. అతనిని చూడగనే నాకోరిక యీడేరగలదని విశ్వసించితిని. అతడు గాంధీజీ యొద్ద స్వయంసేవకుడుగా పనిచేయుచుండెను. పిలిచినది తడవుగా దగ్గరకు వచ్చెను. గాంధీజీతోడి భాషింపవలెనను కోరిక నాతనికి యెరుకపరచితిని. మహాత్ముని దర్శనభాగ్యము లభింపగలదాయను సందేహమును గూడ వెలిబుచ్చితిని. అందుకతడు కడుంగడు యాదరణతో 'అదెంతపని ! పెద్ద పెద్ద రాజకీయనాయకులతో గంటలతరబడి మాట్లాడుటకు వారికి అవకాశముండదేమోకాని, మనబోటి సామాన్య

కార్యకర్తలతో మాట్లాడుటకు వారు తప్పక సమయమిచ్చెద’రను అభయము నాకొసంగెను. అది సాయంకాలపు నాల్గు గంటలవేళ. గాంధీజీ నిప్పుడే దర్శించవచ్చునని నన్ను తన వెంట తోడ్కొనిపోయి నాపరిచయమును బాపూజీకి గావించెను. నేను బాపూజీకి నమస్కరించి “నాకొక ధర్మసందేహముగలదు. ఆ సందేహనివృత్తికై తమతో మాట్లాడ గోరుచున్నా”నని అంటిని. అప్పుడు బాపూజీ, “ధర్మసందేహమా! సరే. నేను సాయంకాలము ఫలహారముగావించి 6 ½ గంటలకు షికారువెడలెదను. అప్పుడు నీవు రావలసినది” అని చెప్పిరి. నేను వారియొద్ద సెలవుపుచ్చుకొని మరల సరిగ 6 గంటలకు గాంధీజీ భవనమునకు వెళ్ళితిని. ఆ భవనములో యింకెవరు బసచేసియున్నారో స్ఫురణకు లేదుగాని సి. యఫ్. ఆండ్రూస్‌గారొక మంచముపై విశ్రమించి యుండిరి.



గాంధీజీవెంట నేను రోడ్డుమీదకు నడచిపోతిని. వారు నడచుచునే ‘ఏమిటి నీ ధర్మసందేహ’మని నన్నడిగిరి. “బాపూజీ! తమ ఆత్మకథలో తాము చేయుపనులన్నియు ఆత్మ దర్శనముకొఱకేననియు, స్వరాజ్యసంపాదనకు తాము రాజకీయములలో ప్రవేశించుట ఆత్మసాక్షాత్కారము కొఱకేననియు, ఈశ్వరసాక్షాత్కారముకొఱకు తమ సర్వస్వమును త్యజించుటకు సిద్ధముగ నున్నామనియు, ఈ శోధన యజ్ఞమున శరీరమునుగూడ హోమముచేయుటకు సంసిద్ధముగనున్నామనియు వ్రాసియుంటిరి. తాము ఈశ్వరుని యే రూపములో సాక్షాత్కరింపగోరుచున్నారు? శంఖచక్ర

గదాపద్మధారియగు మహావిష్ణువు రూపములో భగవంతుని దర్శింపగోరుచున్నారా ?" యని ప్రశ్నించితిని.

"క్రైస్తవులకు భగవంతుడు ఆ రూపములో దర్శనమిచ్చునా ?" యని వారు తిరుగుప్రశ్న వేసిరి. అందుకు ప్రత్యుత్తరముగ నేను భక్తశిరోమణి తులసీదాసుకు ఆ రూపములో భగవంతుడు దర్శనమిచ్చినట్లు గ్రంథాలవల్ల తెలియుచున్నదని యంటిని. బాపూజీ "అవును. 'యద్భావమ్, తద్భవతి'. ఎవరు ఏ రూపములో భగవంతుని ఆరాధిస్తారో వారు ఆ రూపంలో భగవత్సాక్షాత్కారం పొందుతారు. కాని, నేను భగవంతుని యేదో ఒక సాకారమూర్తిగా దర్శింపగోరుటలేదు. నేను నిరాకార, నిర్వికార, నిరంజన, నిర్గుణ, ఆత్మస్వరూపాన్ని సాక్షాత్కరింపజేసికొనగోరుచున్నాను. నిర్వికారస్థితిని పొందగోరుచున్నాను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు లోనుగాక వికారరహితుడనై ఆత్మస్వరూపాన్ని పొందగోరుచున్నాను." అని చెప్పిరి. వారి సమాధానము విన్న పిమ్మట నా ధర్మసందేహము తీరినది. నాబోటి సామాన్య కార్యకర్తకు తమ అమూల్యమగు సమయము నిచ్చి నా సందేహము తీర్చినందుకు వారికి కృతజ్ఞతా వందనములు చెప్పి, మిత్రుడు నారాయణనుండి సెలవు పుచ్చుకొని బసకు చేరితిని. భగవంతుని కృపాకటాక్షమువలన ఈ విధముగా మహాత్ముని కలిసికొని నా ధర్మసందేహమును అనాయాసముగ తీర్చుకొనుటకు అవకాశము కల్గినది.

# 4

## ధర్మసంకటము

### (ఆత్మకథనుండి)

"నేను బొంబాయిలో 'గిరిగాఁవ్' నందు యింటిని అద్దెకు తీసుకొని స్థిరనివాస మేర్పరచదలచుకొంటిని. కాని, ఈశ్వరుడు నన్ను స్థిరముగ నిలువనీయలేదు. ఇల్లు తీసుకొని యెన్నాళ్ళో కాకముందే నా రెండవపిల్లవానికి జబ్బువచ్చి పడెను. టైఫాయిడ్ జ్వరము. జ్వరము జారదు. తడబాటు మాటలు. రాత్రి సన్నిపాత లక్షణములు. ఈ వ్యాధికిముందు ఇతనికి మున్మశూచిపోసెను. డాక్టరును పిలిపించితిని. 'ఇందులకు మందు ఉపయోగింపదు; కోడిగుడ్లరసము, కోళ్ళరసము ఈయవలయు'నని అతడనెను.

మణిలాల్ వయస్సు పదియేండ్లు. వానినేమడుగుదును? సంరక్షకుడను నేనే యేదో యొకటి నిర్ణయింపవలసినవాడను. డాక్టరు సజ్జనుడు. పారశీకుడు. 'అయ్యా, మేము మాంసాహారులముకాము. మీరు చెప్పిన ఈ రెండు వస్తువులలో దేనిని ముట్టము. ఇందులకు బదులు మరియొకటి చెప్పా'డఁటిని."

"మీ కుఱ్ఱవానికి జీవితాశలేదు. పాలలో నీరుకలిపి ఈయవచ్చును. కాని ఆ యాహారము చాలదు. నేను పలువురు హిందువుల కుటుంబములలో వైద్యముచేయుదునని మీ రెరుగుదురు. వారెవరునూ నే నెటుల చెప్పిన నటుల చేయకమానరు. నే నీపైన చెప్పినవి వారు తీసుకొనుచునే

యున్నారు. నేను చెప్పినటులనే మీరునూ విని మీ పిల్లవాని యెడ కాఠిన్యము తాల్పకుందురేని మేలుకల్గును.”

‘మీరన్నది నిక్కమే. కాని తమకిది తెల్పగోరెదను ఇందు నా పూచీ చాల ఎక్కువ. ఇతడు పెద్దవాడై యుండెనేని వాని యిష్టానుసారము ప్రవర్తించి యుండునుగాని యీ విషయము నామీద నేపడినది. మనుష్యునకు ధర్మ సంకటము యిట్టి సమయములందే యని నేననుకొంటిని. తప్పుగాని, ఒప్పుగాని మనుష్యుడు మాంసముతినరాదని నా మతము. జీవనసాధనములకును ఒక యెల్ల కలదు. ప్రాణ ధారణ మొనరించుటకును, ఈ వస్తువుల దినరాదని నా యుద్దేశ్యము. నాకుగాని వానికిగాని యెట్టిసమయములందును నా ధర్మమర్యాద మాంసము మొదలగువానిని నిషేధించు చున్నది. కావున మీరీ కుఱ్ఱవాని జీవితము అపాయగ్రస్తమై యున్నదని నిశ్చయించినను, అట్టిది తటస్థించినను నేను ]నిని ముట్టను. కాని నేనొకటి మిమ్ము యాచింతును. మీ ]ందులు నేను వాడను. నాకు నాడీ హృదయపరీక్ష తెలి ]దు. నాకు కొంచెము జలచికిత్స తెలియును. నేనాచికిత్స ]ేయదలతును. కాని తాము నియమము ననుసరించి మణి ]ాల్‌ను చూడవచ్చి శరీరమునందు జరుగు మార్పులను నాకు ]ెలుపుచుందురేని నేను తమమేలు మరువను’ అని యంటిని. ]జ్ఞనుడగు నతనికి నా యిక్కట్టు తెలిసెను. నా యిచ్ఛాను ]ారము మణిలాల్‌ను చూచిపోవ నంగీకరించెను.

మణిలాల్ తన యుద్దేశ్యమును నిర్ధారించి చెప్పగల ]ాడు కాకపోయినను, నాకును డాక్టరుకును జరిగిన సంభా

షణమును తెలియజెప్పి పిదప నీ యుద్దేశ్య మేమి యని యడిగితిని.

"మామూలు జలవైద్యము చేయండి. నాకు కోళ్ళా వద్దు. కోడిగ్రుడ్లరసమూ వద్దు." అని జవాబు చెప్పెను. నేను వీనిని తినుమని చెప్పినచో తినునని నాకు తెలిసిననూ, ఈ మాటలవలన నాకు సంతసము కలిగెను.

"నాకు 'కూనీవైద్యము' కొంచెము తెలియును. లోగడ నీ వైద్యము చేయుచుంటిని. రోగమునకు 'లంఖనమ్ పరమాషధమ్' అని నాకు తెలియును. కూనీపద్ధతిననుసరించి మణిలాల్‌ను కటిస్నానము మూడు నిముషములుమాత్రము చేయించుచుంటిని. మూడుదినములవరకు నీరుకలిపిన నారింజ పండ్లరస మిచ్చుచుంటిని. వేడి జారలేదు. రాత్రులు, కొంచెము కొంచె మెక్కువగుచుండెను. వేడి 104 డిగ్రీలవరకు పోవుచుండెను. నాకు తొందరబుట్టెను. పిల్లవాని కెక్కువ జేసినయెడల నన్ను లోకులేమనుకొందురు ? మా యన్న యేమనును ? మరియొక డాక్టరును పిలిపించలేకపోయెనా ? ఆయుర్వేద వైద్యుని పిలిపించకపోదుమా ? అపక్వమైన తమ బుద్ధిని పిల్లలపై ప్రయోగింప తల్లిదండ్రుల కేమిహక్కు ?" అని ఇట్టి ఊహలు కల్గెను.

"జీవుడా ! నీవు నీకొఱకు దేనిని చేయుచున్నావో నీ పిల్లవానికిని దానినే చేయుము. దీనికి పరమేశ్వరుడు సంత సించును. నీకు జలచికిత్సమీదగురి. మందుమీద లేదు. డాక్టరు ప్రాణముపోయలేదు. అతడిచ్చునదల్లా మందు. ప్రాణతంతువు

పరమేశ్వరుని చేతనున్నది. ఈశ్వర నామము గ్రహింపుము. మరి దీనిని నమ్ముము. నీ మార్గమును విడువకుము" అని ఈ యూహాలునూ కలిగెను.

"మనస్సునందిటుల మల్లాగుల్లాములు పడుచుంటిని. చీకటిపడెను. రాత్రి మణిలాల్‌ను దగ్గరకు తీసికొని పడుకొంటిని. తడిగుడ్డ మీద కప్పవచ్చునని నిశ్చయించితిని. లేచి బట్ట తెచ్చి చలినీట దడిపి, పిడిచి, తలవరకు గప్పితిని పైన రెండు కంబళ్ళు గప్పితిని. తలకు తడితువాలు చుట్టితిని. ఒడలు పెనమువలె కాలి ఆర్చుకొనిపోయెను. చెమట బొట్టు లేదు. నాకు అలుపుబుట్టెను. మణిలాల్‌ను తల్లి కప్పగించితిని. ఒక అరగంటసేపు మంచి గాలిలో తిరిగి శ్రమతీర్చుకొని శాంతినొందగోరి చౌపాటీ (సముద్రతీరము) వంకకు పోయితిని. పదిగంట లయినది. జనసంచారము తగ్గెను. కాని నాకది యేమియు తెలియుటలేదు. నేను విచారసాగరమున మునిగిపోతిని. ఓ ఈశ్వరా! ఈ ధర్మసంకటమున నా మొఱ ఆలకింపుము. నా నాలుకపైని రామనామ మాడుచునేయుండెను. కొంతసేపటికి యింటికి మరలితిని. నా గుండెలు దడదడలాడుచుండెను. ఇంట జొరగనే మణిలాలు "నాన్నా! వచ్చితిరా?" యనెను. "ఆఁ, నాయనా!" అంటిని. "నన్నిందుండి తీసివేయుడు. ఇందులో చచ్చిపోవుచున్నాను" అని మణిలాల్ పలికెను. నేను మణిలాల్ తల పట్టిచూచితిని. చెమటపట్టియుండెను. వేడి దిగజారెను. నే నీశ్వరునకు చేతులెత్తితిని.

"నాయనా మణిలాలూ! భయము లేదు. ఇక జ్వరము పోవును. కాని కొంచెము చెమట పోయనిమ్ము."

"ఇక ఆగలేను. ఇపుడే నన్ను బయటికి తీయుము. వల యుచో నింకొకతూరి కప్పవచ్చును."

నాకు ధైర్యమువచ్చెను. మాటలతో కొన్ని నిముషములు గడపితిని. చెమట తలనుండి ధారగా కారజొచ్చెను. కప్పినబట్ట లన్నియు దీసితిని. ఒడలంతయు తుడిచి ఆరనిచ్చితిని. పిదప తండ్రి బిడ్డలము ఆ మంచముమీదనే నిదురించితిమి. మా యిరువురకును గాఢనిద్రపట్టెను.

ప్రొద్దున జూతునుగదా, మణిలాలునకు వేడి చాలా తగ్గెను. నలుబదినాళ్ళు పాలు, నీరు, పండ్లమీద నుంచితిని. నాకు భయముతీరెను. జ్వరము మొండిదేగాని తుదకు వశమాయెను. నేడు నా బిడ్డ లందరలో మణిలాలు ఆరోగ్యవంతుడు, బలిష్ఠుడును.

ఇందులకు కారణము రాములవారి కృపయా? జల చికిత్సయా? లేక యేదైన యుపాయమా? దీని నిర్ణయ మెవరు చేయగలరు? ఎవరి విశ్వాసముచొప్పున వారికి నిర్ణ యించుకొన జెల్లును. కాని ఆ సమయమున ఈశ్వరుడే నా వినతి నంగీకరించెనని నేను నమ్మితిని. నేటికినీ నమ్ము చున్నాను."

## 5

## నా ధర్మసందేహము

ఈ ఘట్టమును చదివినపుడు నేను సంశయాత్ముడ నైతిని. భగవంతుని ప్రార్థించినంతనే నా ప్రార్థనను మన్నించి

రోగమునుండి భగవంతుడే కాపాడునా ? యను సందేహము కలిగెను. ధర్మసందేహ నివారణకై నేను 8-4-1928 న మహాత్మ గాంధీజీకి సబర్మతీ ఆశ్రమమునకు జాబు వ్రాసితిని. పూజ్యశ్రీ మహాత్మా గాంధీజీ! తాము ఆత్మకథలో వ్రాసిన మణిలాల్‌కు జబ్బుచేసిన ప్రకరణను చదివితిని. జబ్బుగా నున్న మణిలాల్‌కు కోడిగ్రుడ్లు, కోడిరసము యివ్వవలసినదిగా డాక్టరు సలహా చెప్పగా అవి మాంసాహారమని భావించి, అవి పుచ్చుకొనుట ధర్మసమ్మతముగాదని, డాక్టరు చెప్పిన సలహా నిరాకరించి భగవంతుని మనసారా ప్రార్థించితిమనియు, రాముని కృపవల్లనే మణిలాల్‌కు జ్వరము తగ్గి స్వస్థత చిక్కెననియు వ్రాసితిరి. భగవంతుని ప్రార్థనవల్లనే జబ్బులు నయమగునా? యను నా సంశయమును వెలిబుచ్చి సమాధానము వ్రాయ ప్రార్థించితిని. నా జాబుకు ప్రత్యుత్తరము 16-4-28 న సబర్మతీ ఆశ్రమమునుండి తమ స్వదస్తూరిలో "భగవంతుడు సర్వశక్తిమంతుడుగాన యేమైనా చేయగలడు. అతనికి సాధ్యము కానిదేమున్నది?" అని వ్రాసిరి.

తదుపరి మరొకపర్యాయము నేను వ్రాసిన యీ క్రింది ప్రశ్నలకు ది 2-1-34 న ప్రత్యుత్తరము ఈ విధముగా వ్రాసిరి.

ప్రశ్న : ఈశ్వరస్వరూప మననేమి? ఈశ్వరునెందులకు ప్రార్థింపవలెను ? ప్రార్థించినమాత్రమున ఈశ్వరుడు మన కోరికలన్నియు నెఱవేర్చునా?

గాంధీజీ జవాబు : "ఈ జగత్తులో సర్వవ్యాప్తమైన, చైతన్యవంతమైన శక్తి ఒకటియున్నది. దానినే మనము

ఈశ్వరుడని యందుము. ఆ శక్తిని ప్రార్థించుట యవసరము. ఆ శక్తి మన కోర్కెలన్నిటినీ నెరవేర్చదు. అందునుగురించి మనము చింతించవలసిన యవసరము లేదు.''

మహాత్ముని ఉపదేశమువల్ల మనము గ్రహించునదేమన - మనుష్యమాత్రునకు భగవంతునియందు అచంచలమైన భక్తివిశ్వాసములుంచి అతనిని ప్రార్థించుటతప్ప గత్యంతరములేదు. అహంకారమును వదలి, ఫలత్యాగము చేసి, కర్తవ్యధర్మమును నెరవేర్చుటలోనే మానవునికి శాంతిసౌఖ్యములు లభించును. పై నుదహరించిన ఘట్టములో మణిలాల్‌కు జ్వరము తగ్గుట ఈశ్వరుని కృపయేనని గాంధీజీ భావించెను. మరొక కోరికను భగవంతుడు నెరవేర్చకపోయిననూ భగవంతునియందుగల విశ్వాసము వారికి తగ్గదు. అతడు నిత్యసంతుష్టుడై యుండును. ఈశ్వరునియందు గాంధీజీకి గల భక్తి అచంచలమైనది.

## 6

## రామభక్తుడు గాంధీజీ

"మాది వైష్ణవ సాంప్రదాయము. కావున తఱచు నేను విష్ణ్వాలయమునకు వెళ్ళవలసియుండెడిది. కాని దానియెడల నాకు శ్రద్ధ కలుగలేదు. దాని వైభవము నాకు అభిమతము కాలేదు. అచట కొంత దుర్నీతియు జరుగునని విని దానియెడల ఉదాసీనుడనైతిని. కావున కోవెలవలన నా కబ్బినదేదియు లేదు.

"అయితే నాకచట యేది అబ్బకపోయెనో అది మా కుటుంబమున వృద్ధదాసివలన అబ్బినది. ఆమె వాత్సల్యము నాకు ఇప్పుడూ గుర్తున్నది. భూతప్రేతాదుల భయము నాకు కలదు. రంభయను పేరుగల ఈ నా దాది ఈ భయము పోవుటకు 'రామనామము' మందు అని చెప్పెను. నాకు ఆమె మందుమీదకంటె ఆమెమీద ఎక్కువ నమ్మిక. కావున ఆ లేతవయసున భూతప్రేతభయనాశనమునకు రామనామ మును జపముచేయ మొదలిడితిని. ఇది ఎన్నాళ్ళో జరుగలేదు. ఆ లేతవయసున మనస్సులోపడిన బీజము పొల్లు కాలేదు. రామనామము నాకు నేడు అమోఘమగు ఓషధియగుటకు కారణము నాడు ఆ దాది విత్తిన విత్తనమే.

"సరిగా ఆరోజుల్లో రామాయణమనిన అత్యాదరము గల నా పెదతండ్రి కొడుకు, నా చిన్నన్నకునూ నాకునూ రామరక్షాస్తోత్రము నేర్పు ఏర్పాటుచేసెను. మేము దానిని వల్లించి ప్రతి ఉదయమునను స్నానమైనపిదప పారాయణము చేయ నియమించుకొంటిమి. మేము పోర్బందరులో ఉన్నంత కాలము ఆ దీక్ష సరిగా జరిగినది. కాని రాజకోటకు వచ్చు సరికి శిథిలమైనది. దానియందు నాకు అంతగా నమ్మకము లేదు. రామరక్షను పారాయణము చేయుటకు కారణములు రెండు. ఒకటి - నాకు మా అన్నగారియెడల గల ఆదరము. రెండు - నేను రామరక్షను స్ఫుటముగా ఉచ్చరింపగలనను గర్వము.

"మా తండ్రి జబ్బులో కొంతకాలము పోరుబందరు ఉండెను. ఆయన అచట ప్రతి సాయంకాలము రామా

యణము వినుచుండువాడు. ఆ రామాయణము నాకు బాగుగా నెలకొన్నది. చదువునతడు గొప్ప రామభక్తుడు. ఆయనపేరు లాధామహారాజు. ఆయన పౌరాణికుడు. బిల్వేశ్వర నివాసి. ఆయనకు కుష్ఠుఉండెననియు, ఆయన మందులు మాకులు తినక బిల్వేశ్వరుని దేవాలయమున శివనిర్మాల్యము నందలి మారేడుపత్రినికట్టి రామనామము నిత్యమూ పారాయణముచేయుచుండెడివాడనియూ, తుదకు కుష్ఠు సంపూర్ణముగ కుదిరెననియు వింటిని. అతని విశ్వాసముచే అతనిది వజ్రకాయమాయెనని యనుకొనిరి. ఇది నిక్కము కావచ్చును. కాకపోవచ్చును. ఎటులైనను మేమీ కథను నమ్మితిమి, మరియు లాధామహారాజు రామాయణపురాణము చెప్ప ప్రారంభించు నాటికి అతని శరీరముమీద ఒక మచ్చయైననూ లేదు. లాధామహారాజు స్వరము మధురము. అతడు ద్విపదలు, చౌపదములను పాడి అర్థము చెప్పుచు పరవశుడై శ్రోతలను పరవశులను గావించుచుండెడివాడు. నాకప్పుడు పదమూడేండ్లుండును. ఆ పురాణము వినినపుడు మైమరచుచుండువాడనని గురుతు. ఆ రామాయణశ్రవణమే నాకు రామాయణముపై ఆదరము కలిగించుటకు కారణము. భక్తిగ్రంథములలో తులసీదాసు రామాయణము ఉద్గ్రంథమని నేడు నేనెంచెదను."

ఈ ప్రకరణలో మహాత్మ గాంధి తనకు బాల్యమందే రామభక్తి యెట్లు కుదిరినది, రామాయణమందు శ్రద్ధ యెట్లు కలిగినది వివరించినారు. బాల్యమందు కలిగిన ఈ భక్తిభావమే వారియందు ప్రబలమైనది.

గాంధీజీ ఆరాధించిన రాముడు

గాంధీజీ నిరంతరము రామనామస్మరణ చేయుచుండెడివారు. ఉచ్ఛ్వాస నిశ్వాసము లెట్లు స్వాభావికముగా జరుగుచుండునో అట్లే గాంధీజీకి రామనామస్మరణ స్వాభావికమాయెను. ఆయన హృదయాంతరాళమున ఆ రామనామస్మరణయే నిరంతరము ప్రతిధ్వనించుచుండెడిది. కనుకనే గాంధీజీని 30-1-48 న గాడ్సే పిస్తోలుతో పేల్చినపుడు వారి నోట, వెంటనే 'హే రామ్! హే రామ్' అను శబ్దమే వెలువడినది. రామనామస్మరణ చేయుచునే ప్రాణములు విడిచి విశ్వాత్మలో లీనమైనది వారి ఆత్మ. గాంధీజీ ఆరాధించిన రామునకు, మహమ్మదీయులు ఆరాధించే అల్లాకు, క్రైస్తవులు ఆరాధించే క్రీస్తుకు భేదము లేదు. నామభేదమేకాని సర్వవ్యాప్తమైన ఆ పరమేశ్వరు డొకడేయని వారి నమ్మకం. కనుకనే గాంధీజీ "ఈశ్వర అల్లా తేరేనామ్" అని కీర్తించి భిన్నభిన్న మతముల సామరస్యానికి కృషి చేశారు.

తాము ఆరాధించిన రామునిగురించి 1930 అక్టోబరు నెలలో వెలువడిన 'నవజీవన్' పత్రికయందు గాంధీజీ వివరించినారు.

మోక్షమిచ్చు రాముడు

కొందరు భక్తులు రామాయణము, రామునిగూర్చి అడిగిన ధర్మసందేహములకు ఇందు వివరముగా ప్రత్యుత్తర మొసగిరి. 1930 వ సంIIలో సబర్మతీ సత్యాగ్రహ ఆశ్రమంలో జరిగిన శ్రీరామనవమి మహోత్సవ సందర్భమున గాంధీజీ ఒసంగిన ఉపన్యాసమిది :

నేడు మనము ఏ రాముని గుణగానము చేయవలసి యున్నదో ఆ రాముడు వాల్మీకియొక్క రాముడు కాడు. తులసీ రామాయణములోని రాముడూ కాడు. తులసీ రామాయణము నా కత్యంత ప్రియమగు గ్రంథము. నేను దానిని అద్వితీయ గ్రంథమని తలంచెదను. నే నొక పర్యాయము చదువనారంభించిన విసుగుచెందను. అయినప్పటికిని నేడు మనము తులసీదాసుయొక్క రాముని స్మరించువారము కాము. గిరిధర రాముని భజించుటలేదు. అట్టియెడ కాళిదాస భవభూతులయొక్క రాములగురించి ప్రశ్నించనేల ? భవభూతి రచించిన ఉత్తరరామాయణమందు సౌందర్యమున్నది. కాని యెవని నామము స్మరించిన మనము భవసాగరమును తరింపగలమో అట్టి రాముడు దానియందు లేడు. సహించరాని వేదనతో దుఃఖించుచున్న మనుష్యునకు 'రామనామము స్మరింపు' డని నేను ఉపదేశించుచుందును. అయితే ఆ రాముడు - నే చెప్పు రాముడు - దశరథపుత్రుడును, సీతాపతియు నగు రాముడు కాడు. నా రాముడు దేహధారి రాముడే కాడు. మన హృదయకమలమందున్న రాముడు దేహధారి కాజాలడు. మన హృదయము అంగుళము పరిమాణము కల్గినది. చాల చిన్నది. దానిలో నివసించు రాముడు దేహధారి యెట్లు కాగలడు. అతడు ఏదో ఒక చైత్రశుద్ధ నవమినాడే జన్మించియుండడు. అతడు జన్మరహితుడు. ప్రపంచమునంతటిని సృష్టించినవాడు. సృష్టికర్త. జగత్పతి. కనమన మేరాముని స్మరింపదలచుచున్నామో, ఏ రాముని

స్మరింపవలయునో, ఆ రాముడు మన కల్పితరాముడే. ఇతరులు కల్పించిన రాముడు కాడు.

"ఈమాత్రము జ్ఞాపకముంచుకొన్న మన మనసు నందుదయించు అనేకశంక లిక కల్గజాలవు. వాలిని వధించిన రాముడు పూర్ణపురుషోత్తము డెట్లగునని అనేకపర్యాయములు శంకపొడమును. నా దగ్గరకుకూడా ఇటువంటి ప్రశ్న లనేకములు వచ్చుచుండును. నేను మనసులో నవ్వుకొందును. ఎవడైనా మోసముతో కాని, లేక బహిరంగంగా కాని ఎదుర్కొని ఎవనినైనను చంపినగాని, లేక పదితలలుగల దేహధారియగు రావణుడుండిన వానిని చంపిననూ అదెట్టి ఘనకార్యము ? ఈ కాలములో ఇరువదేమి, అసంఖ్యాక భుజములుగల రావణుడు పుట్టిననూ ఒక బాలుడు ఒక ఫిరంగి గుండు దెబ్బతో అతని యసంఖ్యాకభుజములను, తలలను కొట్టివేయును. అట్టివానిని మనము అలౌకిక బాలునిగా రిగణించము. అతడొక రాక్షసుడనియే తలచెదము. మనము రాక్షసుని పెద్దన్నవలె శక్తిని సంపాదింపకోరుటలేదని నేను లచుచున్నాను. అట్టివానిని పూజించుటవలన మనకు శాంతి లుగదు. మనము అంతర్యామిని, అందరిలోపలనుండు నిని, బయటనుండువానిని, అందరికి స్వామియగువానిని ాజింపవలయును. అతనిని గురించియే మనము "నిర్బలకే లరామ్" నిర్బలులకు రాముడే బలమని గానముచేసితిమి. 'ద్రుపదసుతా నిర్బలభయీ, తాదిన గహలాయే నిజధామ్". ఇక్కడ ద్రౌపది నిర్బలురాలయినప్పుడు రాముడు కాపాడె . ఇందు ద్రౌపదికిని దేహధారియగు రామునకు సంబంధ

యెట్లు కుదురును ? అయినప్పటికినీ కవి, రాముడు కాపాడి నాడని గానముచేసినాడు. ఇందులోని రాముడు అందరకు సామాన్యుడే. అయిననూ ఎవరునూ అతనిని తెలుసుకొన జాలరు. మనమూ రామునే స్మరించుచున్నాము. అంతర్యాము లగు రామకృష్ణులయందు భేదమేమియులేదు. ఈ పండుగ నాడు నిగ్రహముకల్గియుండుటకును, బాలురు నిర్దోషమగు నానందము పొందుటకును రామాయణము చదివి జ్ఞానమును సంపాదించుకొనుటకునూ ఈ శ్రీరామనవమీ మహోత్స వము జరుపబడుచున్నది. దేహధారియగు మనుష్యుడు పరమేశ్వరుని మరొకవిధముగా త్వరగా తెలిసికొనజాలడు. మానవుని కల్పనాశక్తి చాలదూరము పోజాలదు. కనుక పరమేశ్వరుడు మనుష్యరూపమున అవతరించెనని తలచును. హిందూమతములో ఔదార్యమునకు మేరలేదు. కనుకనే పరమేశ్వరుడు మత్స్య, కూర్మ, వరాహ, నరసింహాది రూపముల నవతరించెనని వర్ణింపబడినది. ఇట్లు మానవులు దేహధ్యాస గలవారై ఈశ్వరుని దేహధారి రూపముగా కల్పించిరి. అప్పుడప్పుడు అవతరించునని చెప్పిరి.

భగవద్గీత, అధ్యాయం 4; శ్లోకములు, 7, 8.

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానమ్ సృజామ్యహమ్."
"పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

ఈ విషయముగూడ నేను పైనుదహరించిన ప్రకారం ఆ మేరకే నిజమగును. లేనిచో అజన్ముడు జన్మించుటేమిటి? ఏదోయొక చరిత్రాత్మకమగు పురుషుడు ఈశ్వరరూపముగా గాని లేక ఈశ్వరుడు చరిత్రాత్మకమగు పురుషుడుగాగాని జన్మించినాడని నమ్ముటకు కారణమేమియులేదు. మహా పురుషుల గుణగణములను జూచి మానవులు వారిని పూర్ణావతారమనియు, అంశావతారమనియు నమ్మిరి. ఇది యెరిగి యుండిగూడా వాల్మీకి లేక తులసీదాసుయొక్క రాముని పలువురు ఉపాసకులు తమ ఈశ్వరుడు అతడేనని నమ్మిరి. వారట్లు భజించుటయందు, అట్టి కీర్తనలు గానముచేయుట యందెట్టి దోషమూలేదు. నేను ప్రథమమున చెప్పిన విషయము జ్ఞాపకముంచుకొన్న చాలమంది భ్రమపడుటకేమియు కారణ ముండదు. ఎవరైనను మనయెదుట ఈ శంకలనుంచి మనలను భ్రమలో పడవేయవలయునని తలచిన, ప్రయత్నించిన వారితో మేము దేహధారియగు రాముని పూజించుటలేదని చెప్పుడు. మేము నిరంజనుడును, నిరాకారుడునగు రాముని (సర్వేశ్వరుని) పూజించుచున్నామని చెప్పుడు. ఆ సర్వేశ్వరునివద్దకు సరాసరి – నేరుగా – చేరజాలము కాన ఎవని యందు ఈశ్వరకళ మూర్తీభవించినదని కల్పింపబడినదో వానిని కీర్తించుచున్నాను. ఆరాధించుచున్నాను.

"మనము దేహరూపమగు గోడను దాటి పైకి చూడజాలనంతవరకును, సత్య, అహింసాగుణములు పూర్తిగా మనలో ప్రకాశింపజాలవు. సత్యపరిపాలనగురించి విచారించితిమేని దేహధ్యాస వదలవలసినదే. ఏలయన సత్యమును

పాలించుటకు శరీరత్యాగమైననూ చేయవలెను. అహింసా విషయమునగూడ నింతియే. దేహము అభిమానమునకు కారణమగుచున్నది. దేహముయెడల రాగమున్నవాడు అభిమానరహితుడు కాజాలడు. ఈ దేహము నాది యను భావము నా మనస్సునందున్నంతవరకు నేను పూర్ణముగా హింసనుండి తప్పించుకొనజాలను. ఈశ్వర సాక్షాత్కారము నభిలషించువాడు దేహమును దాటివెళ్ళవలయును. తన దేహమును తిరస్కరింపవలసి వచ్చును. మృత్యువు నాలింగనము చేయవలసియుండును.

"ఈ రెండుగుణములు పొందినపుడే మనము తరింపగల్గుదుము. బ్రహ్మచర్యాది వ్రతముల ననుష్ఠించగలము. సత్యాచరణలేకుండ వాని ననుష్ఠించు టెట్లు? 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్య పిహితం ముఖం'. సత్యముయొక్క ముఖము సువర్ణపాత్రతో కప్పబడియున్నది. సత్యము పలుకుటకు, సత్యమునాచరించుటకు భయమెందులకు? అసత్యరూపమగు తళతళ మెఱయు మూతను (మాయను) తొలగించనంతవరకు సత్యదర్శన మెట్లుకాగలదు? ఎవరైన మనకు అపకారముచేసిన వానిని కోపించుటకుమారు ప్రేమించుట మనకు రుచించునా మనము సంసారము అసారమైనదని పాడుచున్నాము. నన్ను చేరవలయునన్న సంసారమునుండి పరువెత్తిరమ్మని రాముడు చెప్పుచున్నాడు. అయితే ఈ శరీరమును పరుగెత్తించినందు వలన సంసారమును వదలి పరుగెత్తినవారము కాజాలము. అసారవృత్తిని కలుగచేసికొని యిరువదినాలుగు గంటలు పనిచేయుచుండియును గూడ మనము రాముని చేరగలము.

ఈ విషయమే భగవద్గీతయందు బోధింపబడినది. కాబట్టియే నేను గీతను ఒక ఆధ్యాత్మికశబ్దకోశమని తలచెదను. ఈ విషయమునే భక్తశిరోమణి తులసీదాసు మనకొక సుందర కావ్యరూపముగా నుపదేశించెను. కాని నేను మొదటచెప్పినదే కీలకము. అనగా, నా కల్పితరాముడే నన్ను తరింపజేయును. నిన్ను తరింపజేయడు. నీరాముడు నిన్ను తరింపజేయును. నన్ను తరింపజేయడు. మనమందరము తులసీదాసువలె సుందరకావ్యమును (రామాయణమును) రచింపజాలము. కాని, జీవితములో ఈశ్వరానుభవమునుపొంది జీవితమునే కావ్యమయము గావించుకొనవచ్చును.''

మహాత్మగాంధి యొసంగిన ఈ ఉపదేశము మహోత్కృష్టమైనది. అవతారములనుగురించిన విమర్శలకును, ధర్మసందేహములకును చక్కగా సమాధానమిచ్చినారు. ఆత్మతత్వమును, ఈశ్వరతత్వమును ... రామతత్వమును, రాముని స్వరూపమును, రాముని ఆరాధించు విధానమును బాలురకుగూడ అర్థమగునట్లు బోధించినారు.

## 7

## సేవాపరాయణుడు, సత్యసంధుడు

గాంధీజీకి బాల్యమునందే శ్రవణునిపితృభక్తి నాటకము చదువుటచేతను, సత్యహరిశ్చంద్రనాటకమును చూచుటవలనను సేవయందు ఆసక్తియు, సత్యపరిపాలనయందు నిష్ఠయు కలిగెను. గాంధీజీ ఆత్మకథలో ఇట్లు వ్రాసిరి :

"ఒకానొకప్పుడు మా తండ్రిగారు కొనిన శ్రవణ పితృ భక్తి నాటకమును చదివితిని. దానిని అతిశ్రద్ధతో పఠించితిని. ఆ దినములలోనే బొమ్మలాటగాండ్రును మా నివాసమునకువచ్చిరి. వారు చూపుబొమ్మలలో అంధులగు తలిదండ్రులను కావడిలోనుంచుకొని యాత్రకు గొనిపోవు శ్రవణుని బొమ్మయుకలదు. ఈపుస్తకమును, ఆబొమ్మయు నామనస్సుపై మాయని ముద్రవైచెను. 'నీవు లక్ష్యముగా గ్రహించి ఆచరింపవలసిన వస్తువొకటి యిచట యున్నది' అని నన్ను నేను ఆదేశించుకొంటిని. శ్రవణుడు చనిపోగా, అతని తలిదండ్రుల కరుణ విలాపము నేటికినీ నాకు స్మృతికి వచ్చుచున్నది. ఆ జాలిపాట నన్ను చాల ద్రవింపజేసెను. నాతండ్రిగారు కొనియిచ్చిన జంత్రముపై నేను దానిని పాడితిని.

"ఆసమయముననే నాటక సమాజమొకటి వచ్చి హరిశ్చంద్ర నాటకమును ప్రదర్శించెను. నాటకమును చూచుటకు నాకు అనుమతి దొరికెను. దాని నెన్నిమారులు చూచిననూ నాకు విసుగులేదు. కాని, మాటిమాటికి జూడ నాకనుమతి యేడ? అయినను నామదిలో ఈ ప్రదర్శనము పలుమారులు జరిగియుండును. హరిశ్చంద్రుడు కలలో నాకు కానవచ్చుచుండెను. 'అందరును సత్యహరిశ్చంద్రులేల కారాదు?' అని నే నెల్లప్పుడును అనుకొనుచుంటిని. హరిశ్చంద్రుని విపత్తుల వంటివిపత్తులననుభవించి సత్యమును పాలించుటయే ధర్మమని నేను తలంచితిని. నాటకమునందు హరిశ్చంద్రునకువచ్చిన విపత్తులన్నియు వాస్తవము లనుకొంటిని. హరిశ్చంద్రుని దుఃఖములగాంచి, వానిని గుర్తుకు తెచ్చుకొని నే నేడ్చుచుకూర్చుం

టిని. హరిశ్చంద్రుడొక ఐతిహాసికపురుషుడు కాడని నాకిపుడు తోచుచున్నది. కాని, నా హృదయమున నేటికినీ శ్రవణ హరిశ్చంద్రులు జీవించియేయున్నారు. నేనిపు డానాటకముల చదువుదునేని నా కనులు తడవకుండ నుండజాలవు.''

బాల్యమునందు అంకురించిన సేవాపరాయణత్వము, సత్యవ్రతదీక్ష క్రమక్రమముగా వారియందు వృద్ధిచెందెను. అప్పుడప్పుడు మానవ సహజదుర్బలత్వమువలన అసత్యాచరణ చేసిననూ మరల తాను అసత్యమార్గమును వీడి సత్యమార్గముననే జీవితమును గడపెను. సామాన్య మానవుల మనుకొను మనము కూడా దృఢసంకల్పమున సత్యాచరణ ద్వారా మన జీవితములను ధన్యమొనర్చుకొనగలమని గాంధీజీ తమ జీవితాచరణద్వారా నిరూపించిరి.

## 8

## సబర్మతీ సత్యాగ్రహాశ్రమము

మహాత్మగాంధీజీ 1915 వ సంవత్సరము దక్షిణాఫ్రికా నుండి భారతదేశమునకు వచ్చినపిదప భారతావనినంతయు ఒకమారు పర్యటించి దేశనాయకులను కలుసుకొని దేశ పరిస్థితులను తెలుసుకొనిరి. 1916వ సంవత్సరమున గుజరాతు ప్రాంతములో అహమ్మదాబాదు సమీపమున సబర్మతీనదీ తీరమున సత్యాగ్రహాశ్రమము స్థాపించిరి. ఆ ఆశ్రమములో కొందరు బ్రహ్మచారులును, కొందరు గృహస్థులును కుటుంబ సమేతముగా నుండెడివారు. ఆశ్రమవాసులందరును బ్రహ్మచర్యవ్రతమును పాటింపవలయును. ఆశ్రమనియమములకు

క్రమశిక్షణకు లోబడి ఆశ్రమవాసులందరును పవిత్రమైన నిరాడంబర జీవితమును గడుపవలయును. ప్రాతఃకాలమున 4 గంటలకే మేల్కాంచి ఆశ్రమవాసులందఱునూ సామూహిక ప్రార్థనలో పాల్గొనవలయును. ఇండ్లను, వాకిండ్లను, పరిసరములను, పాకశాలను, పాయిఖానాదొడ్లను సహితం ఆశ్రమవాసులే శుభ్రపరచుకొనవలయును. విధిగా ప్రతిదినము రాట్నము వడకవలయును. చెట్లకు నీళ్ళుపోయుట, పిండి విసరుట మొదలగు గృహకార్యములను గూడ నిర్వహింపవలయును. ఆశ్రమనియమములు సత్యము, అహింస, అస్తేయము, అపరిగ్రహము, అస్వాదము, నిర్భయత్వము, సర్వమతప్రీతి, స్వదేశీవ్రతము, అస్పృశ్యతానివారణ – ఈ నియమములన్నియు పాటించుచు తమతమ జీవితములను పవిత్రముగా గడుపుటకు ప్రయత్నించవలయును. ఇట్టి మహోన్నత ఆదర్శములుగల నియమములను పాలించు నిష్కల్మషమైన, స్వార్థరహితులగు సత్యాగ్రహులను సమకూర్చి వారిద్వారా సత్యాహింసాయుతమైన సత్యాగ్రహసమరముసల్పి భారతదేశమునకు స్వరాజ్యము సంపాదింపవలయునని మహాత్ముని యాశయము. ఆ కాలములో విప్లవముద్వారా, హింసాయుతమైన పోరుసల్పి స్వరాజ్యము సంపాదింపవలయును కాని ఆయుధశూన్యులైన సత్యాగ్రహులద్వారా స్వరాజ్య సంపాదనము సంభవమా ? యను సందేహము దేశనాయకులకు, అశేషప్రజానీకమునకు ఉండెడిది. కాని, మహాత్మాజీ తదుపరి సహాయనిరాకరణోద్యమముద్వారాను సత్యాహింసాయుత

మైన సత్యాగ్రహసమరమునకే దేశనాయకులను, ప్రజానీక మునుగూడ అభిముఖులుగా జేసికొనగల్గిరి. 1930 మార్చి నెలలో 79 మంది ఆశ్రమవాసులను వెంటనిడుకొని ఉప్పు శాసనము నుల్లంఘించి, ఉప్పును తయారుచేయుటకు సముద్ర తీరముననున్న దండికి పాదచారియై గాంధీజీ బయలుదేరి నపుడు భారతావనియేకాక ప్రపంచమంతయు దిగ్భ్రాంతి చెందినది. అపూర్వమగు నీసత్యాగ్రహసమరమును ప్రపంచ మంతయు మిక్కిలి కుతూహలముతో గమనించెను. ఈ సత్యాగ్రహ సమరయోధులలో ఆంధ్రదేశమునుండి శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు పాల్గొనుట ఆంధ్రులకు గర్వకారణము. తదుపరి ఈ ఉప్పుసత్యాగ్రహోద్యమము పట్టణములలో, పల్లె లలో ఉత్సాహముతో వ్యాపించెను. వివరములనిచ్చుట కిది తావు కాదు.

ఈ సబర్మతీ సత్యాగ్రహాశ్రమములో కొంతకాలము మహాత్ముని సన్నిధియందుండి, వారివలన శిక్షణపొంది జీవిత మును సార్థకపరచుకొనవలెనను అభిలాష 1926వ సంవత్సర మున కలిగెను. నేనపుడు కృష్ణాజిల్లా కానుమోలు గ్రామములో హిందీప్రచారము చేయుచుంటిని. సబర్మతీ ఆశ్రమములో చేరుట కనుమతి ఇవ్వవలసినదిగా గాంధీజీని ప్రార్థించుచు జాబు వ్రాసితిని. వారమురోజులలో మహాత్ముని ఆంతరంగిక కార్యదర్శి శ్రీ మహాదేవదేశాయిగారినుండి నాకీ ప్రత్యుత్తరము వచ్చినది.

ఆశ్రమము
2-8-1926

మహాశయా !

మీ ఉత్తరము గాంధీజీకి అందినది. ప్రస్తుతము ఆశ్రమములో కొంచెముకూడా స్థలములేదు. కావున మీకు ఆశ్రమములో చేరుటకు అనుమతింపజాలనందుకు విచారించుచున్నాము.

మీ
మహాదేవదేశాయి

నాకు వెంటనే జాబువచ్చినందులకు ఆశ్చర్యమును, ఆశాభంగమును కలిగెను. నేను మహాత్ముని దివ్యసన్నిధిలో నుండి ఆత్మోన్నతికి సాధన చేసికొనవచ్చునని ఉవ్విళ్ళూరుచుంటిని. ఆశ్రమములో స్థలాభావముచే చేరుటకు అనుమతి నొసగనందులకు ఆశాభంగము కలిగెను. కాని వెంటనే ప్రత్యుత్తరము వచ్చినందుకు విస్మయముజెందితిని. ఏలయన, గాంధీజీకి ప్రతిదినము దేశవిదేశములనుండి యనేక ఉత్తరములు వచ్చుచుండును. సాధారణ కార్యకర్తయగు నా ఉత్తరమునకు ప్రత్యుత్తరమువచ్చుననిగాని, వచ్చిననూ ఇంత త్వరితగతిని సాధ్యముగాదని తలంచితిని. గాంధీజీ ఉత్తర ప్రత్యుత్తరములలో ఎంత శ్రద్ధ చూపుచుందురో అనుసరణీయము. తదుపరి నాచే వ్రాయబడిన నాలుగైదు ఉత్తరములకు గూడా వారు ప్రత్యుత్తరమొసగిరి.

# 9

## సహాయ నిరాకరణోద్యమము

1914వ సంవత్సరమునుండి 1918 వరకు జరిగిన ప్రథమ ప్రపంచమహాయుద్ధములో గాంధీజీ మొదలగు నాయకులు బ్రిటిషు ప్రభుత్వమునకు సహాయముచేసిరి. యుద్ధము ముగిసిన పిదప బ్రిటిషు ప్రభుత్వమువారు భారత దేశమునకు స్వరాజ్య మిచ్చెదరని గాంధీజీ మున్నగు నాయకులు ఆశించిరి. కాని, బ్రిటిషు ప్రభుత్వమువారు స్వరాజ్యమునకుబదులు స్వరాజ్యోద్యమమును అణచివేయుటకు రౌలట్ యాక్టు బిల్లును ప్రసాదించిరి. ఈ బిల్లును వ్యతిరేకించుటకు దేశమంతటను హర్తాళ్ జరుపుటకు 1919వ సంవత్సరము ఏప్రిల్ 6వ తేదీ నిర్ణయింపబడినది. ఈ సందర్భములో అనేకచోట్ల దౌర్జన్యములు జరిగినవి. పంజాబులో అమృతసర్ పట్టణములో జలియన్‌వాలా బాగను స్థలములో ప్రశాంతముగనున్న ప్రజలపై డయ్యర్ సేనాని ఆజ్ఞప్రకారము సైనికులు తుపాకులను పేల్చిరి. ఆ కాల్పులలో 400 మంది నిరపరాధులుహతులైరి. 2000మంది పెద్దలు, పిన్నలు, బాలురు, బాలికలు గాయపడిరి. ఈఘోరదురంతము వలన దేశమంతయు అట్టుడికినట్లు ఉడికిపోయెను. ప్రజలలో కోపోద్రేకములు హెచ్చెను. అప్పటి ఈ హింసాకాండను గూర్చి 'పంజాబు దురంతములు' అను పుస్తకముగూడ ప్రచురింపబడెను. ఆ సంవత్సరమునుండి ఏప్రిల్ 6వ తేదీనుండి 13వ తేదీవరకు ఆ వారము జాతీయవారముగా పరిగణింపబడుచున్నది.

గాంధీజీ కాంగ్రెసు నాయకత్వం

1919 వ సంవత్సరంలో గాంధీజీ కాంగ్రెసు మహాసభకు నాయకత్వము వహించి స్వరాజ్యసంపాదనకు నూతన కార్యక్రమము ఏర్పరచెను. 1920 వ సంవత్సరము సెప్టెంబర్ నెలలో కలకత్తాలో అఖిలభారత కాంగ్రెసు మహాసభ సమావేశము జరిగెను. అందు గాంధీజీ సహాయనిరాకరణోద్యమమును ప్రతిపాదించెను. సహాయనిరాకరణోద్యమం ప్రకారం దేశప్రజలు విదేశీ బ్రిటిష్ ప్రభుత్వమునకు సహాయము చేయకూడదు. ఆ ప్రభుత్వ సహాయమును పొందగూడదు. సహాయ నిరాకరణోద్యమముతో పాటు ఆయన నిర్మాణ కార్యక్రమము గూడ ప్రతిపాదించెను.

ఈ కార్యక్రమములోని ముఖ్యవిషయము లివి :

1. విదేశవస్త్ర, వస్తు బహిష్కరణము;
   ఖాదీ వస్త్రధారణ, స్వదేశీవస్తువుల నుపయోగించుట;
2. ప్రభుత్వకళాశాలలను, పాఠశాలలను బహిష్కరించుట.
   జాతీయవిద్యాలయములను నెలకొల్పి జాతీయ విద్యను అభ్యసించుట; మాతృభాష, జాతీయభాష (హిందీ)ల ప్రచారము గావించుట.
3. కోర్టులను బహిష్కరించుట;
   పంచాయతీలను ఏర్పరచి వానిద్వారా వివాదములను పరిష్కరించుకొనుట.
4. శాసనసభలను బహిష్కరించుట.
5. ప్రభుత్వోద్యోగములను వదలుకొనుట.
6. ఆంగ్లప్రభుత్వమువారిచ్చిన బిరుదములను విసర్జించుట.

ఈ విధముగా గాంధీమహాత్ముడు ఏర్పరచిన సహాయ నిరాకరణోద్యమము, నిర్మాణకార్యక్రమము కాంగ్రెసు మహాసభ ఆమోదించెను. అప్పటివరకు ఏ కొలదిమందియో నాయకులకును, విద్యాధికులకును చెందియున్న కాంగ్రెసు మహాసంస్థ, గాంధీజీ నాయకత్వముతోను, ఆయన ప్రతిపాదించిన ఈ కార్యక్రమంతోను భారతీయప్రజ లందరి సంస్థగా రూపొందెను. జనసామాన్యము కాంగ్రెసులోచేరి దీని కార్యక్రమములో పాల్గొనజొచ్చెను. పై కార్యక్రమము నెఱవేర్చుటకు ప్రజలు, విద్యార్థులు, నాయకులు అందరును ప్రయత్నించిరి.

1920 వ సంవత్సరము డిసెంబరు మాసంలో జరిగిన కాంగ్రెసు మహాసభలో కలకత్తా సభలో ఆమోదింపబడిన కార్యక్రమము అంగీకరింపబడెను. నాగపూరులో జరిగిన మహాసభలో దేశములోని అన్నిప్రాంతములనుండి అశేష జనము వచ్చి పాల్గొనిరి. సహాయనిరాకరణోద్యమము దేశమంతటను వ్యాపించెను.

# 10

## బెజవాడ కాంగ్రెసు మహాసభలు

1921 వ సంవత్సరము మార్చి 30, 31 తేదీలలో బెజవాడలో అఖిలభారత కాంగ్రెసు సమితి సమావేశము జరిగినది. కాంగ్రెసు స్థాపించినపిమ్మట ఆంధ్రదేశములో అఖిల భారతకాంగ్రెసు సమితి సమావేశము జరుగుట అదియే ప్రథమము. ఈ సమావేశమునకు దేశములోని ప్రసిద్ధనాయకు

లందరు మహాత్మా గాంధీ, చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్, జమ్నా లాల్ బజాజ్, మహాదేవదేశాయ్, వల్లభభాయిపటేల్, విఠల్ భాయ్ పటేల్, లాలా లజ్‌పత్ రాయ్, మౌలానా మహమ్మదాలీ, మౌలానా షౌకతాలీ (ఆలీసోదరులు), అబుల్ కలామ్ ఆజాద్, హకీమ్ అజ్‌మల్‌ఖాన్, డాక్టర్ అన్సారీ, పురుషో త్తమదాస్ టాండన్, కాకాసాహెబ్ కాలేల్కర్, డాక్టర్ సత్యపాల్, శ్రీమతి సరోజినీనాయుడు, శ్రీమతి కస్తూరిబా గాంధి, శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి, శ్రీ టంగుటూరి ప్రకాశం మొదలగువారు దయచేసిరి. ఈ కాంగ్రెసు మహా సభను చూచుటకును, నాయకుల సందేశములను వినుటకును ఆంధ్రదేశమునుండి రెండు మూడు లక్షల జనము వచ్చిరి. ఆ రోజులలో బస్సు ప్రయాణసౌకర్యములు లేవు. రైలుబండ్ల మీదగాని, యెడ్లబండ్లమీదగాని, నడిచిగాని రావలసినదే. ఈ సాధనములద్వారానే ప్రజలు ముఖ్యముగా గాంధీజీ దర్శ నార్థమై విచ్చేసిరి. ఇప్పుడు విజయవాడలోనున్న గాంధీనగ రము, పూర్ణానందంపేటల ప్రదేశమంతయు ఖాళీగానుండెను. ఆ రోజులలో అక్కడ ఒక ఇల్లుకూడా లేదు. ఆ విశాల ప్రదేశములో బహిరంగసభ యేర్పాటుచేయబడెను. ఆ కాల మున విద్యుద్దీపములుగాని, దూరశ్రవణ యంత్రములుగాని లేకుండెను. ఉత్సాహముతో వచ్చిన రెండుమూడు లక్షలమంది జనమును ప్రశాంతముగ కూర్చుండబెట్టి వారందరికి వినబడు నట్లు ఉపన్యసించు టెట్లు? ఇది ఒక పెద్ద సమస్య ఆయెను. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి నాయకత్వమున ఏర్పా

డిన స్వయంసేవకులు ప్రజలను ప్రశాంతముగ నుంచుటకు ప్రయత్నించిరి కాని వారి ప్రయత్నములు విఫలమాయెను. మొదటిరోజున గందరగోళములో సభ జరుపుటకు వీలు లేక పోయెను. రెండవరోజున శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చీరాల, పేరాల గ్రామములలో 'రామదండు' అనుపేరుతో నేర్పరచిన ఐదువందల స్వయంసేవకుల సహాయముతో ప్రజ లందరిని ప్రశాంతముగ కూర్చుండబెట్టి ఉపన్యాసము వినుటకు వీలుగా ఏర్పాట్లు గావించిరి. మహాత్మ గాంధీగారి యుపన్యాసము శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగా రనువదించిరి. వారిది మృదుమధురమై, అతి గంభీరమగు శ్రావ్యమైన కంఠము. వారి యుపన్యాసము ఆకర్షణీయముగ నుండెడిది. ప్రజలను సమ్మోహితులను చేసెడిది. కాని రెండు మూడు లక్షల జనము వినుటకు వారి గంభీరకంఠధ్వనికూడ చాల దాయెను. అందువలన దూరదూరముగ కొన్ని వేదికలను ఏర్పాటు చేసిరి. ఆ వేదికలపైన శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు మొదలగు నాయకులుండి గాంధీమహాత్ముని ఉపన్యాసమును అంచెలవారీగా అందుకొని ప్రజలకు వినిపించిరి.

గాంధీజీ ప్రదర్శనము

నేనుకూడా గుంటూరునుండి గాంధీమహాత్ముని దర్శించుటకును, వారి యుపదేశముల వినుటకును విజయవాడ వచ్చితిని. అతి కోలాహలముతో జరిగిన ఈ సభలలో దూరముగ నుండి మహాత్ముని దర్శించి వారి యుపన్యాసము వినగల్గితిని. ఆ రోజున సభ జయప్రదముగ ముగిసెను.

విజయవాడలో జరిగిన ఈ కాంగ్రెసుసమితి సమావేశము దేశచరిత్రలో అతి ప్రాముఖ్యమైనది. ఈ సభలోనే స్వరాజ్యమును ఒక సంవత్సరములో సంపాదించుటకు కార్యక్రమము అంగీకరింపబడెను. ఈ కార్యక్రమము (1) కాంగ్రెసు సిద్ధాంతముల నంగీకరించి సంవత్సరపు చందా నాల్గణాలిచ్చు ఒక కోటిమంది సభ్యులను చేర్పించుట. (2) దేశమంతటను 20లక్షల రాట్నములను నెలకొల్పి వానిద్వారా ఖద్దరునుత్పత్తి చేసి, వ్యాప్తిచేయుట. (3) లోకమాన్య బాలగంగాధరతిలక్ స్మారకముగ ఒక కోటిరూపాయల తిలక్ స్వరాజ్యనిధిని సమకూర్చుట మొదలగునవి ముఖ్యాంశములు. ఈ తీర్మానములను దేశవాసులందరు ఉత్సాహంతో నాలుగైదు మాసములలో అమలుజరిపిరి. పై కార్యక్రమంతోపాటు హిందూ మహమ్మదీయ సఖ్యత, అస్పృశ్యతా నివారణ, మద్యపాన నిషేధము మొదలగు సాంఘిక, నైతికాభ్యున్నతికరమగు కార్యక్రమముగూడ కొనసాగించుటకు తీర్మానింపబడెను.

గాంధీజీ గుంటూరు రాక

బెజవాడలో కాంగ్రెసుసమితి సమావేశము ముగిసిన పిమ్మట గాంధీజీ మౌలానా షౌకతాలీతో సహా ఆంధ్రదేశమున కొన్నిరోజులు పర్యటించిరి. 1921 వ సంవత్సరము ఏప్రిల్ 6 వ తేదీన గుంటూరుకు విచ్చేసిరి. అది పవిత్రమైన జాతీయవారము. గుంటూరులో స్వరాజ్యమైదానములో గొప్ప బహిరంగసభ జరిగినది. చుట్టుపట్ల గ్రామములనుండి కూడా ప్రజలు కొన్నివేలమంది గాంధీమహాత్ముని దర్శనము చేసికొని వారి ఉపదేశములు వినుటకు వచ్చిరి. నే నపుడు

గుంటూరులో ఎ. యి. యల్. యం. కాలేజీ (ప్రస్తుతపు ఎ. సి. కాలేజీ) హైస్కూల్లో చదువుకొనుచుంటిని. గాంధీజీ సహాయ నిరాకరణోద్యమము ప్రారంభించినప్పటినుంచి హైస్కూలు చదువుకు స్వస్తిచెప్పి సహాయనిరాకరణోద్యమములో చేర వలయునను తలంపు నాకుండెడిది. కాని అందులకు ధైర్యము చాలకుండెను. మాది బీదకుటుంబము. మా తండ్రిగారు నాకు రెండేండ్ల ప్రాయముననే పరమపదించిరి. నా యన్నలకు వినయ విధేయుడనుగానుండి గుంటూరులో శ్రీ ఏకాదండయ్య పంతులుగారి సహాయముతో వారింటనేయుండి చదువుకొను చుండెడివాడను. పంతులుగారు ఉదారస్వభావులు. నిరాడం బరజీవి. వారికున్న ధనము బీదవిద్యార్థుల చదువుకును, ధర్మ శాలలను, విద్యాలయములను, వైద్యశాలలను కట్టించుటకును వ్యయము చేయుచుండెడివారు. గుంటూరులో హిందూ కాలేజీలోని ఏకాదండయ్యపంతులు హాలు వారు కట్టించి నదే. దణ్డయ్యపంతులుగారియెడల నేను మిక్కిలి వినయ విధేయతలతో ప్రవర్తించుచుండెడివాడను. వారికిని నా యెడల వాత్సల్యము, ఆదరాభిమానములు మెండు. సత్ప్ర వర్తన కల్గి, వినయవిధేయులుగానుండు విద్యార్థులకు వారు బాగుగా సహాయముచేసి విద్యాభివృద్ధికి తోడ్పడుచుండెడి వారు. నేనును వారి సహాయముతో పెద్ద చదువులు చదివి గొప్ప ఉద్యోగముచేసి, లక్షలాది రూప్యములు గడించి దరిద్రదేవతను పాఱద్రోలవలయునను కలలు కనుచుండెడి వాడను. ఈ పరిస్థితులలో నా అభివృద్ధికి తోడ్పడువారి సహాయమును నిరాకరించి చదువుకు స్వస్తిచెప్పి సహాయనిరా

కరణోద్యమములో ప్రవేశించుటెటుల ? యని మథనపడు చుంటిని. ఏప్రిల్ 6 వ తేదీ మా స్కూలు వార్షికపరీక్షలు జరుగుచుండెను. ఆరోజుననే మహాత్మ గాంధి గుంటూరు వచ్చిరి. ఆరోజుతోనే స్కూలుచదువుకు స్వస్తిచెప్పి మహాత్ముని యుపన్యాసమువినుటకు సభకువెళ్ళితిని. అశేషజనమును త్రోసికొని వేదికసమీపమునకు వెళ్ళి మహాత్ముని దర్శించి వారి యుపన్యాసము వింటిని. గాంధీజీ ఆ రోజులలో ధోవతి, చొక్కా, టోపీ ధరించుచుండెడివారు. తదుపరి వారు చొక్కా, టోపీని ధరించుటకూడా మానివేసిరి. వేలాది జనము మహాత్ముని యుపన్యాసము వినుటకు మిక్కిలి ఆతురతతో నుండిరి. గాంధీజీ ప్రథమమున నిట్లుపన్యసించిరి. "నేను బెజవాడనుండి మోటారుకారులో కృష్ణానది ఆనకట్టమీదుగా నిచటకు వచ్చితిని. దారిలో కృష్ణానది పవిత్రతీరమును మలమూత్రముల విసర్జించుచు అపవిత్రముగా చేయుట చూచి నాకు విచారము కలిగెను. ఇది కూడనిపని. మనస్సు, దేహము, పరిసరములు పరిశుభ్రముగా నుంచుకొనవలయును. అప్పుడు కాని మన జాతి పురోగమించదు." గాంధీజీ రాజకీయ, ఆధ్యాత్మిక, సాంఘిక విషయములలో ఎట్టి శ్రద్ధ, పట్టుదల చూపుచుందురో మనము స్వల్పములుగా భావించెడి విషయములయందుకూడా వారు అంత శ్రద్ధ చూపించెడివారు. వారి దృష్టిలో చిన్నవిషయమనునది లేనేలేదు. అన్నియు ముఖ్యవిషయములే. నేటికి అర్ధశతాబ్దము గతించిననూ మన జాతి కనీసము ఈ శుచి, శుభ్రత పాటించుటలోనైనను ముందడుగు వేయకుండుట శోచనీయము. నేటికినీ పవిత్రమైనస్థలము

లను అపవిత్రము చేయుచునేయున్నాము. రైలు, బస్సులలో ప్రయాణముచేయు ప్రయాణీకులుకూడ తమరు తిను తినుబండారములు, అరటిపండ్ల తొక్కలు, బత్తాయికాయపెచ్చులు, వేరుశనగ పొట్టు మొదలైనవి బండిలోనే పడవేయుట విచారకరము. ఈ స్థితి మారి మన జాతి ఎప్పుడు ఈ విషయములో పురోగమించును ? తదుపరి గాంధీజీ కాంగ్రెసు కార్యక్రమము, సహాయనిరాకరణోద్యమము, సత్యాహింసాయుత సత్యాగ్రహ సమరమును గూర్చి విపులముగా నుపన్యసించిరి. 'పంజాబు దురంతములు' అను పుస్తకము రచించిన శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారికి గాంధీజీ ఆ సభలో రు 116 రొక్కమిచ్చి సన్మానించిరి. సభ ముగిసెను.

## 11

## స్వవిషయము

ఇచట స్వవిషయమునుగురించి కొంత ప్రస్తావించుట అప్రస్తుతము కాదనుకొందును. ఏలయన, నేను గాంధీజీ ప్రబోధములచే నధికముగా ఆకర్షింపబడితిని. స్కూలుకు వెళ్ళుట మానివేసితిని. స్కూలుకువెళ్ళుట మాని పెద్దల యెదుట నా పోషకులయెదుట మసలుటెట్లు ? ఏమి చేయవలయును ? ఇది నా సమస్య.

పదవే భద్రాద్రికి పాపిష్టిఘటమా

ఏప్రిల్ నెల చైత్రమాసము. చైత్రశుద్ధ నవమికి భద్రాచలంలో శ్రీరామకల్యాణమహోత్సవములు అతివైభవముగా జరుగుచుండును. ఆ సంవత్సరము బహుశః ఏప్రిల్

13, 14 తేదీలలో ఈ ఉత్సవములు జరిగినవి. ముందు భద్రాచలయాత్ర సేవించి శ్రీరామచంద్రుని దర్శించి తదుపరి జీవిత భవిష్యత్తునుగురించి నిర్ణయించుకొనవచ్చునని నిశ్చయించితిని. బంధువులకు, నా సంరక్షకులకు చెప్పకయే కొందరు మిత్రులతో కలిసి "పదవే భద్రాద్రికి పాపిష్టిఘటమా" యని తలచి భద్రాచలమునకు ప్రయాణము కట్టితిని. ఆ రోజులలో భద్రాద్రివెళ్ళుటకు బస్సులు లేవు. గుంటూరునుండి ఎర్రుపాలెం రైలుస్టేషనువరకు రైలులోవెళ్ళి అక్కడినుండి నడచిగాని బండ్లమీదగాని వెళ్ళవలసినదే. ఎర్రుపాలెముకు భద్రాద్రి 70, 80 మైళ్ళ దూరముననున్నది. మేము కాలినడకనే ప్రయాణము సాగించితిమి. మార్గమధ్యమున కొంత దూరము అడవులలోకూడ ప్రయాణము చేయవలసి యుండెడిది. ఇంతదూరము చాలమంది యాత్రీకులు భక్తితో రామసంకీర్తనలుచేయుచు ఉత్సాహముగా ప్రయాణము చేయుచుందురు. ఆకాలములో మార్గమధ్యమున భోజనహోటళ్ళుగాని, కాఫీహోటళ్ళుగాని ఉండెడివికావు. కొందరు పుణ్యాత్ములు బాటసారులకై చలివేంద్రలున్ను, ధర్మశాలలున్ను ఏర్పరచి భోజనము పెట్టుచుండెడివారు. మధ్యమధ్య ఈ మజిలీలలో మకాముచేస్తూ మేమును శ్రీరామనవమినాటికి భద్రాద్రి చేరితిమి.

సీతారామ కల్యాణమహోత్సవముల కనులారగాంచి తన్మయత పొందితిని. ఉత్సవాల అనంతరం మరల కాలినడకనే ప్రయాణముచేసి ఐదారు రోజులలో గుంటూరుచేరితిని. గుంటూరు చేరినతరువాత గుంటూరులోని కాంగ్రెస్

నాయకులు శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగార్లను కలుసుకొని నా భావి కార్యక్రమమునుగురించి నిర్ణయించుకొంటిని. హిందీ నేర్చుకొని, కాంగ్రెస్ ఇతరనిర్మాణకార్యక్రమముతోపాటు హిందీ, ప్రచారము చేయవలసినదిగా వారు నాకు సలహానిచ్చిరి. తదుపరి శ్రీ ఏకాదండయ్య పంతులుగారికిని, మా అన్నగారికిని నేను స్కూలు చదువుమాని భద్రాద్రియాత్ర సేవించి వచ్చిన విషయము విన్నవించి వారి అనుమతిలేకుండా యీ పనిచేసినందుకు క్షమింపకోరితిని. వారును హిందీనేర్చుకొని భాషా ప్రచారముగావించుటకు సమ్మతించిరి. ఆ కాలములో 1918 సంవత్సరములోనే మహాత్మగాంధీగారు మద్రాసులో దక్షిణభారత హిందీప్రచారసభను స్థాపించి తద్వారా దక్షిణదేశములో హిందీ భాషాప్రచారము గావించుచుండిరి. మహాత్మగాంధీగారి ఆదేశానుసారము బీహారువాస్తవ్యులు శ్రీ రామానందశర్మగారు గుంటూరులో హిందీప్రచారము చేయుచుండెడివారు. మహాత్మగాంధీగారి సత్యాగ్రహ ఆశ్రమమునకు నకలుగా వారు తామున్న గృహముననే ఆనందాశ్రమమను పేరుపెట్టి అందు హిందీబోధ నిరంతరము చేయుచుండెడివారు. నావలెనే హైస్కూలు చదువులమాని హిందీ నేర్చుకొనువారికి వారింటనే బస ఏర్పాటుచేసిరి. ఆ ఆశ్రమములో సాధ్యమైనంతవరకు సబర్మతీ ఆశ్రమ నియమముల ప్రకారము ప్రార్థన, రాట్నమువడకుట మొదలగు కార్యక్రమములు జరుపుచుండెడివారు. ఈ ఆశ్రమములో చేరిన వారందరిపేర్లు ఆనందులుగా మార్చి పిలచెడివారు. నాపేరు

"కృష్ణానంద్'. శ్రీ శివరామశర్మగారు 'శివానంద్'. శ్రీ ఉన్నవ వెంకటప్పయ్యగారు 'బ్రహ్మానంద్' అయిరి. ఆశ్రమములో కొంతవరకు హిందీ అభ్యసించిన పిమ్మట 1921 సం. లోనే ప్రప్రథమముగా ఆంధ్రదేశములో రాజమహేంద్రవరములో స్థాపింపబడిన హిందీ ప్రచారక ఆశ్రమంలో హిందీ ఉపాధ్యాయుడుగను, దక్షిణభారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖకు ఆర్గనైజరుగను, కార్యదర్శిగను, దక్షిణభారత హిందీ ప్రచారసభ, (మద్రాసు)కు సంయుక్త కార్యదర్శిగను, హిందీప్రచారోద్యమములోనే పనిచేసి 1962వ సంవత్సరములో పదవీవిరమణ చేసితిని.

# 12

## నా ధర్మసందేహము (౨)

మహాత్మగాంధి స్వరాజ్యసంపాదనకు హింస, యుద్ధము కూడదని బోధిస్తున్నారు. శ్రీ కృష్ణభగవానుడే అర్జునునకు యుద్ధము చేయవలసినదిగా ఉపదేశించినారు. అట్టియెడ స్వరాజ్య సంపాదనకు హింసతోగూడిన యుద్ధము ఏల ధర్మసమ్మతము కాదు?" అను సందేహము నాకు కలిగెను. నా ధర్మసందేహమును తీర్చుకొనుటకు నేను 1928 ఏప్రిల్ నెలలో మహాత్మగాంధి గారికి ఉత్తరమువ్రాసితిని. గీతలో శ్రీ కృష్ణభగవానుడు అర్జునునకు యుద్ధము చేయవలసినదిగా ప్రోత్సహించుచు యిట్లు ఉపదేశించిరి :

హతో వా ప్రాప్స్యసి స్వర్గం, జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ, యుద్ధాయ కృతనిశ్చయః ॥

సుఖదుఃఖే సమే కృత్వా, లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ, నైవం పాప మవాప్స్యసి ॥

యదా యదా హి ధర్మస్య, గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్ ॥

పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే ॥

పూజ్య మహాత్మగాంధీజీ । నమస్కారములు

ఈ పై శ్లోకములలో శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు యుద్ధము చేయవలసినదిగా బోధించిరి. ధర్మముకొరకు చేయు యుద్ధమువలన పాపము తగులదని చెప్పిరి. ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియుకలిగినపుడు తాను అవతార మెత్తి సాధువులను రక్షించి దుష్టులను సంహరించుచుందు ననియు శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశించిరి. అట్టి యెడ భారతీయులకు జన్మహక్కగు స్వరాజ్యమును యుద్ధము చేసి, శత్రువులను సంహరించి యెందుకు సంపాదించగూడదు ? ఈ హింస ధర్మసమ్మతమేల కాదు ? దయచేసి నా ఈ ధర్మ సందేహమును తీర్చ వేడెదను.

మచిలీపట్టణము, భవదీయ విధేయుడు,
8-4-28. ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

ఈ నా ఉత్తరమునకు మహాత్మా గాంధీజీ స్వయముగా నాకు హిందీలో ప్రత్యుత్తరము వ్రాసిరి.

మహాత్ముని జవాబు

భాయీ రాజ్‌గోపాల్ !

భగవాన్ సర్వశక్తిమాన్ హోనేకే కారణ్ సబ్ కుఛ్ కర్ సక్తా హై. హింసాకా ఉత్తర్ హింసాసే నహీం హోనా చాహియే. మహాభారత్ కా ఐతిహాసిక్ అర్థ్ కర్నేసే ధర్మకా జ్ఞాన్ నహీం మిల్ సక్తా ఔర్ మహాభారత్ ఇతిహాస్ తో హైహీ నహీం.

అప్‌కా,

మోహన్‌దాస్ గాంధీ

16–4–28.

భాయీ రాజగోపాల్ !

భగవంతుడు సర్వశక్తిమంతుడగుటవల్లసర్వమునుచేయ గలడు. హింసకు ప్రతిక్రియగా హింసను ఉపయోగింపరాదు. మహాభారతమునకు ఇతిహాసపరముగా అర్థము చెప్పినయెడల అందలి ధర్మసూక్ష్మము తెలియదు. మహాభారతము ఇతిహాసము (చరిత్ర) కానేకాదు.

మీ

16–4–28 మోహన్‌దాస్ గాంధి

గాంధీజీ స్వదస్తూరీతో వ్రాసిన యీ ఉత్తరం అందినపుడు నాకు కలిగిన ఆశ్చర్యమునకు, ఆనందమునకు మేర లేదు. నాపేరు రాజగోపాలకృష్ణయ్య. కాని నన్ను 'భాయీ రాజగోపాల్' అని సంబోధించుటలో ఎంత ఆత్మీయత

ఉన్నది. ఈ ఆత్మీయతయే నన్ను పరవశునిగా చేసినది. ఈ ఆత్మీయతయే బాపూజీకిగల వశీకరణశక్తి. వారికి ఎందరో ఉత్తరములు వ్రాయుచుందురు. నాబోటి సామాన్య కార్యకర్తకుగూడ శ్రద్ధవహించి త్వరలో నాకు స్వయంగా జాబు వ్రాసినందులకు నాకు చాల ఆనందము కలిగెను.

మరొక మిత్రుడు భగవద్గీత విషయమై తనకుగల సందేహములను మహాత్మగాంధిగారికి వ్రాయగా వారు "నవజీవన్" పత్రికలో అన్ని సందేహములకు విపులముగా సమాధానము వ్రాసిరి. ఆ వ్యాసమును చదివినపిమ్మట భగవద్గీతను అర్ధము చేసుకొనుటలో కలిగిన సందేహములన్నియు తీరినవని చెప్పవచ్చును. అచంచలమైన భక్తిశ్రద్ధలతో గీతను అధ్యయనంచేసి, గీతాబోధను అనుసరించుటకు సతతము ప్రయత్నముచేసిన గాంధీజీ వ్యాఖ్యయే సరియైనదని నావిశ్వాసము. గాంధీజీ నవజీవన్ పత్రికలో వ్రాసిన వ్యాసపు అనువాదమును దిగువ యిచ్చుచున్నాను.

## 13

## శ్రీమద్భగవద్గీతా తాత్పర్యము

"శ్రీకృష్ణభగవానుడు అర్జునున కుపదేశించిన కర్తవ్యము హింసయా అహింసయా? అను వివాదమున కంతము కనబడదు. గీతను నిర్మలభావముతో, ఏదోఒక ఉద్దేశము మొదటనే పెట్టుకొనకుండా చదివినచో కలుగు అర్ధము సంగతి వేరు. మన మాపాదించిన లేక కల్పింపదలచుకొన్న అర్థము

సంగతి వేరు. కేవలము అహింసాసిద్ధాంతమందే గాఢ విశ్వాసముకలవారు గీతవంటి ఉత్తమగ్రంథము అహింసనే బోధించునని నమ్మట సహజమే. అది అటుల బోధింపనిచో అట్టివారికి గీతయందు సంపూర్ణ భక్తి కలుగదు. దానియందలి యితరవిషయముల ప్రాశస్త్యమునుబట్టి కొంత భక్తియుండక పోదు గాని సమగ్రమగు భక్తిమాత్రము కలుగదు.

"ప్రథమాధ్యాయమున అర్జునుడు అహింసా తత్పరమతియై సమరమును రోసి గాండీవమును క్రిందబెట్టెను. యుద్ధమొనరించి గురుబంధుమిత్రాదులను వధించినచో తమోగతి కలుగుననుభీతి అతనికపరిమితముగా కలిగెను. ధైర్యము తొలగెను. ఇట్టి ఘోరకార్యమును చేయజాలనని అర్జునుడు నుడివెను.

"ఇట్టి స్థితిలో శ్రీకృష్ణభగవానుడు నరునకు ఉత్తమోత్తమమగు వేదాంత రహస్యమును బోధించెను. 'జీవునకు మరణములేదు. శరీరము నశించకతప్పదు. జీవుల కెవ్వరికిని కర్తృత్వములేదు. కర్త ఈశ్వరుడే. నీవు ఎవరిని భరింపలేవు. నీవు క్షత్రియుడవు. నీ ధర్మమును నీవు నెరవేర్చకున్న నీకు పాపము కలుగును. నీవు ఫలమునపేక్షించకుండ, నీవు కర్తవను దురభిప్రాయమును, రాగద్వేషములను వదలి భగవదర్పణబుద్ధితో భగవత్ప్రేరణవలన యుద్ధముచేయుచున్నానను నమ్మకముతో చేయుము.' అది భగవత్సేవయేయని చేయవలెను. అప్పుడది మోక్షప్రదము కాగలదని భగవానుడు బోధించెను.

పదకొండవ అధ్యాయములో భగవానుడు పార్థునకు విశ్వరూపము చూపించెను.— "నేను అనంతానంత సకల కళ్యాణగుణ పరిపూర్ణుడను. సచ్చిదానందవిగ్రహుడను. సర్వస్వామిని. పురాణ పురుషుడను, చేయువాడను చేయించువాడను నేనే. ఫలప్రదదాతను ఫలభోక్తను నేనే. సర్వాంతర్యామిని, సర్వనియామకుడను, సర్వోత్తముడను నేనే. సృష్టి స్థితి సంహారములను నేనే చేయుచున్నాను. నేనే కాల నియామకుడను. ఇపుడు సంహారమునకు పూనియే ఈయవతారమెత్తితిని. వీరందరిని నే నిదివరకే సంహరించితిని. నీవు నిమిత్తమాత్రుడవు. ఈ శరీరములపై లోకంకొఱకు నీ బాణములను వదలుము. అజ్ఞానమును, దుఃఖమును వీడుము." అని భగవానుడు బోధించెను.

"దేవునకు హింస అహింస అను భేదమే లేదు. కాని మానవునకు భగవంతుడు చేసిన బోధయేది? 'నీకు తప్పక విజయము కలుగును గాన యుద్ధముచేయుము' అనునదేనా? భగవద్గీత అహింసనే బోధించునెడ మొదటి అధ్యాయమును పదకొండవ అధ్యాయమును సమన్వయించియుండలేదు. అహింసను బలపరచియుండలేదు. కావున ఈ విషయమున నా సంశయమును తొలగింపగోరెదను." అని ఒక మిత్రుడు నాకు వ్రాసెను.

"ఈప్రశ్న సార్వకాలికము. అందరును యేదోయొక విధమున దీనిని గ్రహించెదరు. దీనిని గ్రహించుటకు కావలసినది నిర్మలభావముగాని మేధాశక్తికాదు. మొదట 'ఒక

విషయము మనసునకు వచ్చును. పిమ్మట మేధాశక్తి దానికి హేతువుల నరయును. మొదట కలుగునది నమ్మకమే. పిమ్మటనే హేతుబలము చేకూర్చును. ఒకడు ఒక పనిచేయునపుడు కారణము కనబడుచునేయుండును. ఐనను నేను యిచట నా అభిప్రాయము తెలిపెదను. దీనిని అందరు ఆమోదింపరని నేనెరుగుదును. అది సహేతుకమే. నాకిట్టి విశ్వాసము కలుగుటకుగల కారణముల వివరించుటయే నా ముఖ్యకర్తవ్యము. నా విశ్వాసము స్థిరపరచుటకే నేను ప్రయత్నించెదను. నేను కృతార్థుడనగుదునా కానా ? అను విషయముతో నాకు నిమిత్తములేదు.

"నేను ఇరవై ఏండ్ల యువకుడనుగా నుండగా తొలిసారి గీతను చదివితిని. అపుడు నాకు అహింసాతత్వము సరిగా తెలియదు. ప్రేమచే శత్రువులను గూడ జయింపవచ్చునని ఘూర్జరకవి శ్యామలభట్టు వ్రాసిన గేయమునందలి ఉత్తమ భావము నా మనసున బాగుగ నాటుకొనెను. కాని దాని వలన నేను శాశ్వతమగు అహింసాసిద్ధాంతమును గ్రహింపజాలనైతిని. ఆ కవి సిద్ధాంతములో మానవేతరులగు జంతువులను గూడ చేర్చియుండలేదు. అంతకుపూర్వము నేను భారతదేశమున నున్నపుడే మాంసమును భుజించుచుంటిని. పాములు మొదలగు క్రూరజంతువులను చంపుటయే మానవధర్మమని తలచుచుంటిని. వానిని గూడ చంపగూడదనియే నేనిపుడు నమ్ముచున్నాను. ఆంగ్లేయులతో పోరుటకు యుద్ధముచేయుట ధర్మమేనని నే నపుడు నమ్ముచుంటిని. అందులకు బలము సంపాదించుటకే నే నపుడు మాంసమును

తినుచుంటిని. అటుపిమ్మటనే నేనును ఆంగ్లదేశమునకు వెళ్ళితిని. అపుడు నేను నా తల్లియెదుట మద్యము, మాంసము, పరస్త్రీని ముట్టనని ప్రమాణము చేసితిని. ఆ ప్రమాణమును యావజ్జీవమును జరుపుటకు దీక్షబూనినప్పటి నుండియు మాంసాహారమును వర్జించితిని. సత్యవాక్య నిరతియే నన్ను హింసాపాతకమునుండి కాపాడినది.

"ఆంగ్లదేశమునందు ఇరువురాంగ్లేయులు నాకు మిత్రులైరి. భగవద్గీతను చదువవలెనని వారు నన్ను కోరిరి. అప్పటికి నాకు హిందూమత గ్రంథములతో నెట్టిపరిచయములేదు. సంస్కృత భాషాజ్ఞానముకూడ చాలా తక్కువ. గీతా శ్లోకములన్నింటిని స్వతంత్రముగా అన్వయముచేసికొనగల శక్తి నాకు లేకుండెను. అట్టి స్థితిలో ఆ మిత్రులు నన్ను గీతను చదువగోరిరి. నా అసమర్థతనుగూర్చి నాకు చాల సిగ్గును, విచారమును కూడ కలిగెను. వారికి సంస్కృతము కొంచెము గూడ తెలియదు. సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారు గీతకు చక్కని అర్థమును ఆంగ్లభాషలో వ్రాసిరి. దానిని నా మిత్రులిరువురు నాకొసంగిరి. దానిని నేను ఆమూలాగ్రముగా చదివితిని. చదువగానే నాకు చాల ఆసక్తి కలిగినది.

"ద్వితీయాధ్యాయమున కడపటి పందొమ్మిది శ్లోకములును నా హృదయఫలకమున గాఢముగా అంకితమైనవి.

"వానిలోనే సకల సత్యమును అనంతజ్ఞానముగూడ యిమిడియున్నది. వానిలో హేతువాదముగూడ నుండినను, అపరోక్షముగ జ్ఞాని అనుభవమంతయు వానిలో ప్రతిఫలించుచున్నది.

"అటుపిమ్మట నేను పెక్కుసారులు చదివితిని. చాల భాష్యములనుగూడ చదివితిని. చాలమందితో చర్చించితిని. కాని మొట్టమొదట నాకు కలిగిన భావముమాత్రము మారలేదు. గీతాతాత్పర్యమును సరిగా గ్రహించుటకు ఆ శ్లోకములే ముఖ్యాధారములు. వానిలోని అర్థమునకు భిన్నమూలైనవిగూడ కొన్ని శ్లోకములు కలవు. వానిలోని అర్థమునకు భిన్నమగు అర్థముగల ఆ శ్లోకములను వదలివేయవలెనని గూడ నేను సూచించుదును. కాని వినమ్రుడగు జ్ఞానార్థి దేనిని వదలనక్కరలేదు. 'ఈ వైరుధ్యమును సమన్వయింపగల శక్తి అల్పజ్ఞుడనగు నాకు ఇప్పుడులేదు. శ్రీహరి కటాక్షమున నిటుపైని కలుగవచ్చు' నని అతడు మనస్సమాధానము కావించుకొనును.

మతగ్రంథముల భావమును సరిగా గ్రహించుటకు భక్తి విశ్వాసానుభవములు ప్రధానము. శూద్రుడు వేదములను చదువగూడదని నిషేధించుట కేవలము నిరాధారము కాదు. శూద్రుడనగా ఆధ్యాత్మిక జ్ఞానశూన్యుడనియే అర్థము. అట్టివాడు వేదాదుల చదివినచో అపార్థము చేసికొనుటకు చాల అవకాశముండును. అక్షరగణిత సమస్యను అందరును పూర్తిచేయజాలరు. అందులకు కొంత ప్రత్యేక పరిశ్రమ యుండవలెను. ఘోరకృత్యములను నిత్యమును సలుపుచుండు హంతకుని నోటపడినచో 'సోహం బ్రహ్మ' అను వాక్య మెటుల వక్రించునో చూడుడు. ఆ బ్రహ్మవాక్యమును ఆ హంతకు డెటుల దుర్వినియోగము చేయునో, దానికె విపరీత స్వరూపమును కలిగించునో యించుక యోచింపుడ

వేదవేదాంతోపనిషర్థమును గ్రహించి బోధింపగోరు వాడు యమనియమాదుల నభ్యసింపవలెను. వానిని నామ మాత్రముగ నొనరించిన లాభములేదు. గురుముఖముననే అభ్యసింపవలెనని శ్రుతిస్మృతులు విధించినవి. ఇపుడట్టి గురువులు లభించుట కష్టమగుటచే భక్తినికలిగించు ఆధునిక గ్రంథములను చదువవలెనని తపస్సంపన్ను లుపదేశించిరి. భక్తివిశ్వాసములు లేనివారు బ్రహ్మజ్ఞానమున కనర్హులు. పాండిత్యమువలన శ్రుతిస్మృతుల కేదో విపరీతార్థమును కల్పించవచ్చునుగాని అది సహజమైన అర్థము కానేరదు. సద్గురుసంసేవనముచేసి అభ్యసించినవారికే సహజార్థము విదితమగును.

“సామాన్యులకుగూడ కొన్ని నియమములున్నవి. సత్య విరుద్ధమగు అర్థము సరియైన అర్థము కాదని వారు గ్రహింపవలెను. సత్యమునుగూర్చియే సంశయించువారికి వేదవిద్య నిష్ఫలము. అట్టివారితో ఎవరును వాదింపజాలరు. వేదవిద్యయందు అహింసను గ్రహింపజాలని అపాయముకలదు గాని అటువంటివానికి పతితస్థితిలేదు. సత్యము స్థిరము, శాశ్వతము. అహింస అస్థిరము. సత్యము స్థితి. అహింస లయము. అయినను అహింస ఉత్తమము. సత్యము ప్రత్యక్షము. అహింస దాని ఫలము. అహింస సత్యమునందంతర్లీనముగాన అగోచరము. కావుననే మానవుడు అహింస నంగీకరింపకుండ వేదశాస్త్రములను గ్రహింపజూచునుగాని — అతడు సత్యము నంగీకరించినచో అహింసనుగూడ క్రమముగా గ్రహింపగలుగును.

సత్యమును గ్రహించుటకు శరీరసౌఖ్యత్యాగ మవసరము. సత్యద్రష్ట విశ్వవ్యాపృతమగు హింసయందే అహింసను దర్శింపగలుగును. అహింసలేకుండ సత్యమును చూడజాలము. అహింస నాచరించుటకు బ్రహ్మచర్యము, అస్తేయము, అపరిగ్రహము మున్నగునవి అవసరము. సత్యమునకు ప్రాణము అహింసయే. అహింస లేని మానవుడు ద్విపాదపశువు. సత్యాన్వేషణ మొనరింపగోరువాని కివియన్నియును ఆ కృషిలోనే గోచరించును. అపు డట్టివానికి వేదశాస్త్ర సహజార్థము బాగుగ గోచరించును.

"ఇంకొక విషయ మేమనగా భావమునకు ప్రాధాన్య మివ్వవలెగాని శబ్దార్థమునకు కాదు. తులసీదాసు రామాయణమందు కనికరమును, పవిత్రతయును, భక్తియును నిండి యున్నందుననే దానికి ఔన్నత్యము కలిగినది. ఆ రామాయణములోని ఒక దోహా –

'శూద్ర గవాఁర్ ఢోల్, అరు నారీ
యే సబ్ తాడనకే అధికారీ"

శూద్రులు, అవివేకులు, డోళ్ళు, స్త్రీలు వీరందరు తాడనకు అర్హులు – అని ఉన్నది. తన భార్యను కొట్టుచుండువాడు ఆ దోహాను ప్రమాణముగ చూపునెడల వాడు పాపమునకే పోవును. రాముడు తన భార్య నెన్నడును కొట్టలేదు సరిగదా ఆమెమనస్సునకు నొప్పికలుగునటులగూడ ఎన్నడు చేయలేదు. అట్టి దోహాను తన గ్రంథమున చేర్చుటవలన క్రూరాత్ములగువారికి తాను ప్రమాణము కలిగించువాడ నగుదునని గూడ తులసీదాసు తలచియుండడు. ఆ కాలములోనున్న

లోకోక్తిని తులసీదాసు తన రామాయణమందు వ్రాసెను. ఒకవేళ ఆ కాలమునందలి ఆచారము ననుసరించి తులసీదాసు తన భార్యను కొట్టుచుండెననియే అనుకొందము. అంతమాత్రమున నది సదాచారమగునా? కాదు. అది ఎప్పటికిని దురాచారమే. భార్యలను భర్తలు కొట్టుట తప్పుకాదని సమర్థించుటకు రామాయణము వ్రాయబడలేదు. రాముడు పురుషోత్తముడు, సీత మహాసాధ్వి, భరతుడు పరమభక్తుడు అని నిరూపించుటకే రామాయణము వ్రాయబడెను. కావున దానియందెచటనైన దురాచారములను సమర్థించు శ్లోకములుండినను వానిని వర్జింపవలసినదే. భూగోళమును బోధించుటకు తులసీదాసు రామాయణము వ్రాయలేదు. కాన భూగోళమును గూర్చిన విరుద్ధవిషయము లందేమైన నున్నచో వానినిగూడ విసర్జింపవలసినదే.

"ఈ భావములతో భగవద్గీతను పరీక్షింపవలెను. ముక్తిని, సత్యారాధనమును గూర్చి బోధించుటకే గీత ఉపదేశింపబడెను. ఉభయసేనామధ్యమున దానికి కలిగిన అవసరము గ్రంథకర్త యుద్ధమును హింసను నిరసించువాడు కాడు గాన యుద్ధము చేయుమని ప్రోత్సాహపరచెనని వాదించినను వాదింపవచ్చును. కాని మహాభారతమును చదువుట వలన నాకట్టిభావము కలుగలేదు. యుద్ధము నిష్ఫలమని చూపించుటకే వ్యాసుడు మహాభారతమును వ్రాసెనని నాకు తోచినది. కౌరవులు ఓడిరి. పాండవులు గెల్చిరి. కాని చివరకు మిగిలిన వారెందరు? వారికెట్టి గతిపట్టినది? కుంతి గతి యేమయినది? యాదవులగతి యేమయినది?

"మహాభారతమునకు సంగ్రామ సంహారములు ప్రధాన విషయములుకావు. కనుక వానిని గూర్చి నొక్కిచెప్పుట అనుచితము. గీతలో కొన్ని శ్లోకములు అహింసకు సమన్వయించకపోయెనందురా ? తక్కిన భాగమంతయును హింస కెంత మాత్రము సమన్వయింపదు.

"తన గ్రంథమునకు పలువురు పలువిధముల వ్యాఖ్యానము చేయుదురను నభిప్రాయము గ్రంథకర్త ఊహించి యుండడు. ఊహాతీతములయిన కల్పనలు కావించుటయే కవితయందుగల విశేషము. కవి మనస్సుచే గ్రహించిన ఉత్తమ సత్యము అతని ఆచరణయందు లోపముగనే యుండును. కావున చాలమంది కవుల గ్రంథార్థములును వారి అనుష్ఠానములును విరుద్ధముగనే కనపడుచుండును. రెండవ అధ్యాయమున ప్రారంభింపబడి సంగ్రహముగా మరల వివరింపబడిన యుపదేశమువలననే గీతాతాత్పర్యము అహింస గాని హింసకాదని స్పష్టమగుచున్నది. తక్కిన అధ్యాయములందలి విషయముగూడ అహింసనే సమర్థించుచుండెను. కామక్రోధరాగద్వేషము లుండినగాని హింస జరుగదు. వీటినన్నిటిని, గుణత్రయమును గూడ గీత నిషేధించినది. అర్జునుడు తన గాండీవమును చెవియంట వింటిత్రాడు లాగి ఎక్కుబెట్టినపుడెల్ల నతడు క్రోధ తామ్రాక్షుడగుచుండినటులే నా భావప్రపంచమున గోచరించుచుండును.

"అహింసకొర కర్జునుడు యుద్ధమును మానదలచలేదు. అదివర కతడు పెక్కుసారులు యుద్ధము చేసియే యుండెను.

ఈసారికతని కనుచితముగా బంధుపామరత్వము కలిగినది. మమ కారము వలన స్వజన వినాశమున కాతడు పూనుకొనజాలక పోయెను. హత్యాదోషము గాన యుద్ధముచేయనని అర్జునుడు తెలుపలేదు. ఇతరులను వధించుట కతనికెట్టి ఆక్షేపణయును లేదు. శ్రీకృష్ణభగవానుడు సర్వజ్ఞుడు గాన తాత్కాలికమగు అర్జునుని మనోదార్బల్యము సరిగా గ్రహించెను. నీవిదివరకు హింసచేసియే యుంటివి గాన యొక్కసారిగా అహింసా నియమమును పూనజాలవు. దీనిని పూర్తిచేయుమనియే భగవానుడు బోధించెను.

"కాశీకిపోవు రైలుబండిలో ప్రయాణము చేయుచున్న వానికి ఆకస్మికముగా బుద్ధి తిరిగిపోయి తటాలున బండినుండి క్రిందకురికినచో వానికి ఆత్మహత్యాదోషము కలుగును. అంతేగాని అతడు ప్రయాణములోగల నిష్ప్రయోజకత్వమును, రైలుప్రయాణమందుగల అనర్థకమును గ్రహించిన వాడు కాజాలడు. అర్జునుని స్థితిగూడ అట్టిదే. అహింసా పరాయణుడగు శ్రీకృష్ణభగవానుడు అర్జునుని కపుడు మరి యొకరీతిని ఉపదేశమును చేయజాలడు. ఆ సమయమున యుద్ధము చేయుమని భగవానుడుపదేశించెను గాన గీత యుద్ధమును - హింసను బోధించుచున్నదని తలంచుట మాత్రము చాల అనుచితము. నిత్యమును మానవులు తెలిసియు తెలియకయు ఏదో కొంత హింసచేయకుండ తప్పించుకొనజాలరు కాన హింస దోషము కాదనువాదన ఎటుల అసమంజసమో గీత హింసను బోధించుచున్నదను వాదము గూడ అటులే అసమంజసము. గీతాతాత్పర్యమును సరిగా

గ్రహించినవారికి అది అహింసనే బోధించుననియును, భౌతిక శరీరమును సాధనముగా చేసికొని సచ్చిదానందాత్మకమగు స్వస్వరూపమును సందర్శించుటకు సహాయకమగుచున్నదని యును స్పష్టముగా తెలియగలదు.

"ధృతరాష్ట్ర, యుధిష్ఠిర, అర్జున, శ్రీకృష్ణాది పురుషు లందరును యథార్థ వ్యక్తులేయని గీతవర్ణించెనా ? సమరతల మున సర్వము సన్నద్ధమై ఇరువీరులును తలపడనున్న తరుణ మున అర్జునుడు తటాలున వైరాగ్యభావమును వెల్లడించి అటుల ప్రశ్నించుటయును సంభవమగునా ? తన అవివేకము తొలగినదని అర్జునుడు తెలిపి పిమ్మట మరల మరచిపోతి ననియు మరల దానిని తెలుపవలయుననియు శ్రీ కృష్ణుని వేడుటయు శ్రీకృష్ణుడు మరల దానిని చెప్పజాలనని అణు గీతను తెలుపుటయు ఎటుల జరిగియుండును ?

"మానవునిలోనుండు ఉత్తమభావములను సూచించు టకు పాండవపక్షము వారును, నీచభావములను సూచించు టకు కౌరవపక్షమువారును ఉద్దేశింపబడిరి. రణరంగము మానవుని భౌతికశరీరమే. ఈ శరీరమున ఉత్తమాధమ భావములకు నిరంతరము సమరము జరుగుచునేయుండును. కవిబ్రహ్మ దానినే గీతాశాస్త్రమున వర్ణించెను. శరీరస్థుడగు జీవుని హృదయకమలమధ్యమున సాక్షీభూతుడుగానుండి నిరంతరమును సద్భావమును బోధించుచుండు పరమాత్మయే శ్రీకృష్ణుడు. గడియారమునకు నిత్యమును కీ యిచ్చుట - ఎటుల అవసరమో అటులే మానవహృదయమునకు పవిత్రీ

కరణ మవసరము. లేనిచో లోననుండు సాక్షి మౌనము వహిం చును.

"భౌతికముగ సమరము బొత్తుగా జరుగనేకూడదని కాదు. అహింస నెరుగనివాని కధోగతియేయని గీత తెలుపుటలేదు. స్వార్థపరులు, భీరువులు, ఇంద్రియాధీనులు మున్నగు వారు యిష్టముండినను లేకున్నను భౌతికముగ సమర మొనరించుచునే యుండవలెను. కాని అది మానవ ధర్మముకాదు. మానవధర్మ మొక్క అ హిం స యే. అహింసవలననే మోక్షము కలుగును. మోక్షమనగా సత్యసందర్శనమే. అచట భీరువులకు తావులేదు. ఈ వింత ప్రపంచమున శాశ్వతముగా హింస జరుగుచునేయుండును. దానినుండి తప్పించుకొనుటకు దారిని చూపుటయే గీతా తాత్పర్యము. పిరికితనముమాత్రము కూడదనియే గీత బోధించెను. పిరికితనము కలిగియుండుటకంటె భౌతికముగ పోరి శత్రువును చంపుటయైన లేక తాను చచ్చుటయైన మంచిదనియే గీతబోధించెను.

"ఈ విలేఖరి అడిగిన సంశయములు యింకను అతనికి నివారణ కానిచో నే నసమర్థుడ ననియే తెలుపుచున్నాను. సర్వేశ్వరుడే సృష్టిస్థితిలయకారుడని స్పష్టముగా అంగీకరించబడెనా - సర్వేశ్వరుడే సృష్టికర్తయైనచో సంహారమునకు గూడ నతనికి సర్వాధికారముగలదు. కాని అతడు సృష్టిని, సంహారమునుగూడ చేయడు.

'జాతస్య మరణం ధ్రువమ్' అనునదియే భగవన్నియమము. అదియే భగవంతుని కరుణామయత్వము. భగవన్ని

యమములు సుస్థిరములు. వానికి మార్పులేదు. వానినాతడు యిచ్ఛానుసారము తరచుగా మార్చుచుండినచో జీవరాసుల గతియేమై యుండును?"

ఈ వ్యాసములో మహాత్మా గాంధీజీ గీతాసారమును పండితపామరులకు సుబోధకమగునట్లు వివరించినారు. గీతా పాఠకులకు సాధారణముగా కలుగు సందేహములన్నిటికి ఈ వ్యాసములో సమాధానము చెప్పబడినది. ఈ వ్యాసము గీతను అర్థము చేసికొనుటకు మిక్కిలి తోడ్పడగలదు.

# 14

## ఖద్దరుప్రచారము-గాంధీజీ ఆంధ్రదేశ పర్యటన

మహాత్మాగాంధీజీ 1929 వ సంవత్సరములో ఖద్దరు ప్రచారమునకును, ఖద్దరు నిధికి విరాళములు వసూలు చేయుటకును ఆంధ్రదేశములో పర్యటించిరి. ఈ పర్యటనలో ఆంధ్ర నాయకులు శ్రీయుతులు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి మున్నగువారు నిధిని వసూలుచేయుటకు సంచారముచేసిరి. గాంధీజీ వెళ్ళిన ప్రతిపల్లెలోనూ, పట్టణంలోను ప్రజలు వేలకు వేలు గాంధీజీని దర్శించి వారికి కానుకలు అర్పించిరి. ఈ నిధికి ధనమేకాక స్త్రీలు, పిల్లలు తమకుగల ఆభరణములను సహితము భక్తిపూర్వకముగ సమర్పించిరి. ఈ పర్యటనలో గాంధీజీ మచిలీపట్నము వచ్చినపుడు శ్రీ భోగరాజు పట్టాభి

సీతారామయ్యగారి యింట బసచేసిరి. ఒకరోజున భక్తి పూర్వకముగా స్త్రీలు, పిల్లలు ఇచ్చిన ఆ నగలను శ్రీ దేశ భక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారును, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారును తెచ్చి లెక్కించుటకు కుప్పలుగా పోసిరి. ఆ బంగారునగలరాశిని చూచి నా కన్నులు మిఱుమిట్లు గొనెను. నరనరము గగుర్పాటుచెందినది. కన్నుల వెంట ఆనందబాష్పములు వెలువడినవి. ఆ పుణ్యస్త్రీలు ఎంత భక్తిశ్రద్ధలతో గాంధీజీయందుగల అపార విశ్వాసముతో ఖాదీయుద్యమమునకై తమ ప్రియమైన నగలను అర్పించిరో యను భావము కల్గినది. ఈ పవిత్రద్రవ్యమును సద్వినియోగముచేసిన ఖాదీఉద్యమము జయప్రదమగునని భావించితిని.

ఇట్లు తమ నగలన్నింటిని భక్తిపూర్వకముగ సమర్పించుట నేను తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయమందే చూచితిని. మరల శ్రీ గాంధీమహాత్మునకు సమర్పించుట కనులారా గాంచితిని. గాంధీమహాత్మునకు సమర్పించిన కానుకలు ప్రతిఫలాపేక్ష లేనివి. కాని శ్రీ వేంకటేశ్వరునకు సమర్పించు కానుకలో! ఫలాపేక్షతో కూడినవి. సాధారణంగా స్వామికర్పించు నగలు మ్రొక్కుబడిక్రింద చెల్లించునవే. అనగా, భక్తులు ఒకానొక వ్యాధి నయమైనందులకో, ఒకపదవి లభించినందులకో, లేక ఒకానొక కోరిక నెఱవేరినందులకో బదులుగా సమర్పించు నగలే యవి. ఏ కోరికలు కోరకుండా శ్రీ వేంకటేశ్వరస్వామికి - భగవంతునికి - కానుకలుగాని, నగలుగాని సమర్పించుట యరుదు. కనీసము తమ

కుటుంబమును రక్షించి ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి కాపాడవలయునను కోరికనైననూ శ్రీ వేంకటేశ్వరుని కోరెదరు. కాని శ్రీ గాంధీమహాత్మునకు సమర్పించిన కానుకలు ప్రతిఫలాపేక్షలేని శుద్ధ భక్తితత్వముతో నొసంగినవే.

# 15

## నా ధర్మసందేహము (౩)

నేను ఆ రోజుల్లో మచిలీపట్నములోనే ఆంధ్రజాతీయ కళాశాలలో హిందీ ఉపాధ్యాయుడుగా పనిచేయుచుంటిని. గాంధీమహాత్ముని కలసికొని నాకుగల ధర్మసందేహమును తీర్చుకొనవలయునను తలంపు గలదు. ఆ కళాశాలకు కార్యదర్శి భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు. అది వారి యాధ్వర్యమున నడచుచుండెడిది. నేను వారి యధీనములో పనిచేయు కార్యకర్తను. గాంధీజీకి ఊపిరాడనిపని. వారి దర్శనము చేసుకొనుటకును, వారితో మాట్లాడుటకును, కానుకలు సమర్పించుటకును అనేకమంది ప్రముఖులు వచ్చి పోవుచుండెడివారు. శ్రీ పట్టాభిగారి యనుమతినిబొంది గాంధీజీవద్దకు వెళ్ళవలయును. గాంధీజీతో మాట్లాడుటకు అనుమతి యిప్పించవలసినదిగా పట్టాభిగారిని అడుగుటకు నాకు భయము. నేను 1920 వ సంవత్సరమునుండి కాంగ్రెసు కార్యకలాపములలోను, ప్రధానముగా హిందీ ప్రచారోద్యమములోను ఉత్సాహముగ పనిచేయుచుండుటవలన ఆంధ్ర దేశములోని ప్రసిద్ధ నాయకులందరితోను ఎక్కువ పరిచయముగలదు. శ్రీయుతులు దేశభక్త కొండా

వెంకటప్పయ్యపంతులు, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వర రావుపంతులు, ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులు, గొట్టిపాటి బ్రహ్మయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, బెజవాడ గోపాలరెడ్డి, మాగంటి బాపినీడు మొదలగువారు నాయందు ఎంతో వాత్సల్యమును చూపుచు హిందీ ప్రచారోద్యమమునకు తోడ్పడి నన్ను ప్రోత్సహించు చుండెడివారు. కాని నాకు పై నాయకులందరు ఒకయెత్తు. శ్రీ పట్టాభి సీతారామయ్యగారొకయెత్తు. శ్రీ పట్టాభిగారి యందు చనువు తక్కువ. అదేమోకాని వారిదగ్గరకు వెళ్లు టకు కొంత జంకు, గాంధీజీతో నీకు ఇంటర్వ్యూ ఏమిటని పరిహాసించెదరేమోయను భయముకూడా కలదు. తీరా వారిని అనుమతికోరి వారిచే ననుమతి నిరాకరింపబడిన పిమ్మట గాంధీగారిని కలుసుకొనుటకు యత్నించుట అప రాధమేయగును. నేను వారి యధీనమున పనిచేయు కార్య కర్తనుగదా! పట్టాభిగారి క్రమశిక్షణ నిశితమైనది. వారు క్రమశిక్షణకు వ్యతిరేకముగా నడచువారిని సహించరు. ఈ విషయము నాకు తెలియును. కనుక, పట్టాభిగారి యనుమతితో గాంధీగారిని కలుసుకొనుట దుర్లభమని భావించి, నేనే స్వయముగా సమయము చూచుకొని, గాంధీజీని దర్శించి మాట్లాడుటకు నిశ్చయించుకొంటిని. ఆ రోజు మధ్యాహ్నం రెండు, మూడు గంటలసమయం. శ్రీ పట్టాభిగారు ఇంట్లో విశ్రాంతి తీసుకొనుచుండిరి. మేడపైన ఒక ప్రత్యేక గదిలో గాంధీగారున్నారు. ఈ అదనుచూచుకొని నేను నేరుగా గాంధీజీయున్న గదిలోనికి వెళ్ళితిని. గాంధీజీ విశ్ర

మించుటలేదు. రాట్నము వడుకుచున్నారు. ఒకరిద్దరు కార్య కర్తలు వారివద్ద కూర్చునియుండిరి. నేనును గదిలోనికేగి నమస్కరించి సమీపముగా కూర్చుంటిని, తదుపరి నా ధర్మ సందేహమును వారితోనిట్లు విన్నవించితిని. "బాపూజీ! భగవద్గీతలో సమత్వమునుగురించి యిట్లున్నది."

"విద్యా వినయ సంపన్నే, బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవశ్వ పాకేచ పండితాస్సమ దర్శినః"

విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, చండాలుని సమానముగా చూచువాడే పండితుడు, జ్ఞాని.

"బాపూజీ! అందరినీ సమదృష్టితో చూచుట యనగా నేమి? పైనచెప్పిన యందరిని సమముగా గౌరవించుటెట్లు? అందరియెడల సమానమైన భక్తి గౌరవములు కల్గియుండుట సాధ్యమా? నాకు మీ యందపరిమితమైన భక్తిశ్రద్ధలు గలవు. తమను ఒక అవతారపురుషునిగా నేను భావించు చున్నాను. తమ యుపదేశములను భక్తిశ్రద్ధలతో పఠించు చున్నాను. వినుచున్నాను. తమను దర్శించినపుడు మిక్కిలి వినయముతో, భక్తితో, ప్రణమిల్లుచున్నాను. తమను, ఉన్నతమైన ఆసనమున కూర్చుండబెట్టి తమ సన్నిధిని, పాద పద్మములకడ కూర్చుండుటకు నేను అభిలషింతును. కాని, ఒకచాకలి మురికిబట్టలను ఉతుకుటకు తీసికొనివెళ్ళుటకు నా యింటికి వచ్చినపుడు నేనులేచి, నమస్కరించి, దయచేయుడు!

కుర్చీలో కూర్చొనుడు' అని అతనిని గౌరవించిన అతనితో పాటు లోకులుకూడ నన్ను పిచ్చివాడననుకొందురు. కనుక ఈ సమత్వమును అనగా అందరినీ సమానగౌరవమర్యాదలతో ఆదరించుట మాబోటి గృహస్థులు నిత్యజీవితములో ఆచరణలో పెట్టుటెట్లో దయచేసి సెలవిండు" అని అడిగితిని. ఈ క్లిష్టమైన నా ధర్మసందేహము సులువుగా బోధించినారు. బాపూజీ, సమత్వమంటే అదికాదు. ఎవరికేది యవసరమో గుర్తించి వారి కావిధముగా సేవచేయుటయే నిజమైన సమత్వము 'హాథీ కో మన్, చీవుంటీ కో కణ్' అన్నట్లు ఏనుగకు మణుగు ఆహారము, చీమకు ఒక్కకణము మాత్రము పెట్టి ననూ రెంటికినీ ఆహారమును సమానముగ పెట్టినట్లేయగును. రెంటినీ సమానముగ చూచినట్లే భావన. ఆకలిగొన్నవారి కిని, ఆకలి లేనివానికిని సమానముగా ఆహారము పెట్టిన యిద్దరికినీ అపకారము జేసినవారమే యగుదుము. వారిద్దరినీ సమదృష్టితో చూచినవారముకాము. ఆకొన్నవానికి ఆహారముపెట్టుట యవసరము. ఆకలిలేని వానిని ప్రేమతో బలవంతముచేసి ఆహారము తినిపించినచో నతడు తిని వాంతి చేసుకొనును. కనుక, యిక్కడ ఒకనికి ఆహారము పెట్టుట లోను, మరొకనికి ఆహారము పెట్టకుండుటలోనూ సమత్వము చూపిన వారమగుదుము. ఒక బ్రాహ్మణునకుగాని, కుక్కకు గాని, ఆవుకుగాని, చండాలునకుగాని జబ్బుచేసినచో ఆజబ్బు నివారణకై వారికి ప్రేమాదరములతో సేవచేసినచో అది సమభావమగును. వారియందరియందు సమత్వభావము కల్గిన వారమగుదుము. కనుక, ఎవరికే సేవ యవసరమో వారికా

సేవను ప్రతిఫలాపేక్ష లేకుండా చేయుటవల్లనే సమదృష్టి కలుగును, అట్లుచేసినవాడే పండితుడు, జ్ఞాని. అభ్యాసము వల్లను, అనుభవమువల్లను మీకు ఈ ధర్మములు బాగుగా బోధపడగలవని బాపూజీ ఉపదేశించారు. మా ఈ సంభాషణ ముగియుచున్నది. ఇంతలో పట్టాభి సీతారామయ్యగారు మేడపైకి గాంధీజీయున్న గదిలోనికివచ్చి సమయమయిపోయినది. సంచారమునకు బయలుదేరవలయును. సిద్ధముకండియని మహాత్మాజీకి సూచించారు. నేను శ్రీ పట్టాభిగారికొక నమస్కారముచేసి బాపూజీనుండి సెలవుపుచ్చుకొని బయటికి వచ్చితిని. బాపూజీనడిగి ధర్మసందేహమును తీర్చుకొనుటకు నాకు అనాయాసంగా ఈ సదవకాశము లభించినందుల కమితానందముపొంది నేను ధన్యుడనైతినని తలచి భగవంతునికి ప్రణమిల్లితిని.

# 16

## ఖాదీ తత్వము

గాంధీజీ ప్రచారముచేసిన ఖాదీ ఉద్యమములో ఆర్థిక, రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక తత్వములు ఇమిడియున్నవి స్వావలంబనసిద్ధాంతము, స్వదేశీయాభిమానము, ఆత్మగౌరవభావన, త్యాగనిరతియు నిందు కలవు. ప్రతి గ్రామము సాధ్యమైనంతవరకు తిండికి, బట్టకు స్వావలంబనముగా ఉండవలయునని గాంధీజీ ఆశయము. ప్రతివారును తమ ఇంటనూ, పొలములోనూ ప్రత్తిని పండించి తామే ప్రత్తితో ఏకులను చేసికొని తమ ఇంట రాట్నముతో నూలువడికి ఆ నూలుతో

తమ గ్రామములోనే మగ్గముమీద బట్టలు నేయించుకొని ఆ బట్టను ధరించవలయునని గాంధీజీబోధ. ఆ బట్టకట్టుకొన్న పుడు వారికి తాను తయారుచేసిన బట్టయను ఆత్మాభిమానము, తృప్తి, ఆనందము కల్గును. ఈ పరిశ్రమద్వారా ఆర్థికముగ ఆ కుటుంబమునకు కొంత సహాయము కల్గును. స్వతంత్రజీవనమునకిది కొంత తోడ్పడగలదు. ఖద్దరును విదేశీ వస్త్రముకంటె ప్రియమైననూ స్వదేశీయాభిమానముతో ధరించుటలో కొంత త్యాగనిరతి కలుగును. గాంధీజీ, భారత దేశస్వరాజ్య ఉద్యమానికి రాట్నచక్రమును ఒక అహింసా యుధముగా ఉపయోగించినారు. ప్రతి కాంగ్రెసు సభ్యుడును విధిగా రాట్నము వడకవలయునను నియమము నేర్పరచిరి. స్వాతంత్ర్య సంగ్రామ అహింసాయోధులు-సత్యాగ్రహులు-పవిత్రమైన ఖద్దరు వస్త్రములనే దీక్షావస్త్రములుగా ధరించ వలయునని ప్రబోధించినారు. భారతస్వాతంత్ర్య సంపాదన ఆత్మస్వారాజ్య సాధనకు ప్రథమ సోపానముగా భావించి నారు. దాస్యశృంఖలాలలో నున్న భారతజాతికి స్వరాజ్యము లభించినగాని ఆత్మవికాసము కలుగదని వారు భావించినారు. ఖద్దరు గ్రామపరిశ్రమల యభివృద్ధికి పునాది.

రాట్నమే జపమాల

"శరీరమాద్యం ఖలు ధర్మసాధనం," ధర్మసాధనకు శరీరము అవసరముగదా! శరీరపోషణకు అర్థం - అన్నం - ఆవశ్యకముగదా! శరీర పరిశ్రమవల్లనే అన్నము లభించు చున్నదిగదా! కనుక, మానవుని ఆధ్యాత్మిక, ఆర్థిక జీవితములకు అవినాభావ సంబంధమున్నది. కాయకష్టముచేసి

అన్నమును సంపాదించుకొనవలయుననునది మహాత్మునిసిద్ధాంతము. కొందరు భక్తులు, యోగులు కాయకష్టము చేయకయే యోగాభ్యాసమువలనను, భక్తివల్లను ఆత్మజ్ఞానమును పొంది ముక్తిని బడయుటకు సాధన చేయుదురు. గాంధీమహాత్ముని తపస్సు కాయకష్టముతో కూడినది. మానవసేవయే మాధవసేవ యని వారి ప్రగాఢ విశ్వాసము.

రాట్నముద్వారా గాంధీజీ ఆర్థిక ఆధ్యాత్మిక జీవితమును సమన్వయపరచెను. చాలమంది భక్తులు మనస్సు యేకాగ్రతకు, ఆత్మశక్తిని పొందుటకు, జపమాలను ఉపకరణముగా నుపయోగించుచున్నారు. కాని, గాంధీ మహాత్ముడు, జపమాలకు బదులు రాట్నచక్రమును ధ్యానమునకు, ఏకాగ్రత పాటించుటకు నుపయోగించెను. జపమాల ఏకాగ్రతసాధనకు ఆధ్యాత్మికసాధనకు మాత్రమే ఉపయోగపడును. కాని, రాట్నచక్రము ఆధ్యాత్మికసాధనకే కాక ఆర్థికసాధనకుకూడ నుపయోగపడుచున్నది. రాట్నము త్రిప్పుటచే లభించిన నూలుకు ఆర్థికవిలువ గలదు. 'ఏకక్రియా ద్వ్యర్థకరీ', 'ఏక్ పంథ్ దో కాజ్'; ఒకే కార్యమువల్ల ఆర్థికాధ్యాత్మిక సంపదలను పొందనగును. నరుని, నారాయణుని ఒకేసారి సేవింపగల్గుదుము. గాంధీజీ తన్ను దరిద్ర నారాయణ సేవకునిగా భావించెడివారు. వారు ఆర్థిక, ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక, ధార్మిక, సాంస్కృతికాదిగాగల సర్వతోముఖాభివృద్ధికి కృషిసల్పిన పూర్ణపురుషుడు.

గాంధీజీకి ఈశ్వరునియందు అనన్యమైన భక్తి గలదు. ఈశ్వరుడే అనేక కష్టములలో తమను రక్షించెనని తమ

ఆత్మకథలో వ్రాసుకొనిరి. ఆత్మకథనుండి – "అన్ని ఇక్కట్ల లోనూ, నన్ను ఈశ్వరుడే రక్షించెను. జీవితముయొక్క వివిధ రంగములలో నా కిది యనుభవము. ఈశ్వరుడు నన్ను రక్షించెనను వాక్యమున కర్థము నేడు నాకు చక్కగా తెలియును. కాని, ఇంకనూ దీని విలువ సరిగా గుర్తింపజాలకున్నా ననియు నే నెరుగుదును. అనుభవముచేత నే అది తెలియదగినది. కాని, యెన్నియో ఆధ్యాత్మిక యత్నములందును, లాయరుపనియందును, సంస్థల సంచాలనములందును, రాజకీయ వ్యవహారములందును నాకు కలిగిన విషమపరిస్థితులలో భగవంతుడు నన్ను రక్షించెనని చెప్పగలను. ఉపాయములన్నియు నిరుపయోగములైనపుడు, సహాయకులు దిగనాడినపుడు, నిస్సహాయుడనైనపుడు ఎటనుండియో, ఎటులనో ఆ దైవసహాయము వచ్చునని నా యనుభవము, స్తుతియు, ఉపాసనయు, ప్రార్థనయు ఇవి గ్రుడ్డినమ్మకములు కావు. ఇవి పాన, భోజన, స్నాన, గమనములకంటె యధిక సత్యములు. ఇవియే సత్యములు. మిగిలినవి యసత్యములన్నను అతిశయోక్తి కాజాలదు. ప్రార్థన – ఉపాసన – వాణి వైభవము కాదు. దీనికి కావలసి నాలుక కాదు, హృదయము. కావున భక్తి కలిగి హృదయమును నిర్మలముచేసికొంటిమేని మన మాయనంతమున కెగురగలము. ప్రార్థనకు జిహ్వతో పనిలేదు. అది స్వభావముచేతనే యద్భుతవస్తువు. 'వికారరూపములగు మలములను, అనగా కామాదులను శుద్ధిచేయుటలో హృదయపూర్వకమైన యుపాసన ఉత్తమసాధనమని చెప్పుటకు నేను

సందేశించపను. అయితే, ఆ యుపాసన అతి వినతితో, అతి నమ్రతతో పొంది పొసగి యుండవలెను.”

గాంధీజీది ప్రార్థనామయ జీవితము. నిరంతరము వారి హృదయాంతరాళములో రామనామము ప్రతిధ్వనించుచుండును. చివరకు ది 30-1-’48 న గాడ్సే గాంధీజీని తుపాకితో పేల్చినపుడు రామనామస్మరణతోనే దేహమును చాలించినారు. ‘హే రామ్’, ‘హే రామ్’ అను శబ్దమును ఉచ్చరించుచునే నేల కొరిగినారు. వారి ఆత్మ విశ్వాత్మలో లీనమైనది.

# 17

## హిందూమతోద్ధరణ

మహాత్మా గాంధీజీ అస్పృశ్యులనబడే నిమ్నజాతుల వారికి హరిజనులని పేరుపెట్టిరి. 1932 వ సంవత్సరంలో బ్రిటిష్ ప్రభుత్వమువారు భారతదేశములోని హరిజనులను సవర్ణహిందువులనుండి వేరుచేసి వారికి ప్రత్యేక నియోజక వర్గముల నేర్పరచి మిగిలిన హిందువులతో సంబంధము లేకుండా హరిజనులే తమ ప్రతినిధులను ఎన్నుకొనునట్లు శాసనము చేసిరి. లండన్‌లో రౌండ్ టేబుల్ సమావేశము జరిగినప్పుడే ఈ శాసనమును ఉపసంహరించుకొనవలసినదిగా గాంధీజీ బ్రిటిష్ ప్రభుత్వమును కోరిరి. కాని బ్రిటిష్ ప్రభుత్వము గాంధీజీ విన్నపమును అంగీకరించలేదు. హిందువులను విభజించి విచ్ఛిన్నము చేసే ఈ శాసనమును ప్రాణము నొడ్డియైన రద్దు

చేయించెదనని గాంధీజీ ప్రతినపూనెను. గాంధీజీ లండన్‌లోని రౌండ్ టేబుల్ సమావేశమునుండి భారత దేశమునకు తిరిగి వచ్చిన తరువాత వారిని నిర్బంధించి ఎఱవాడ జైలునం దుంచిరి. ఎఱవాడ జైలులోనున్నప్పుడే గాంధీజీ, 'ఈ శాస నమును రద్దుచేయవలెను. లేనిచో నేను 20-9-1932 తేదీ నుండి ఆమరణాంతము నిరాహారదీక్ష పూనుచున్నా'నని ప్రక టించి ఆ తేదీనుండి నిరాహారదీక్ష ప్రారంభించిరి. మహాత్ముని ఈ కఠోరదీక్షకు దేశమంతయు అట్టుడికినట్లుడికిపోయెను. దేశ నాయకులందఱు మహాత్ముని ప్రాణములెట్లు కాపాడుటయా యని తహతహలాడిపోయిరి. బ్రిటిష్ ప్రభుత్వము కదలిపోయి నది. మహాత్మునకు ప్రాణాపాయము కల్గిన బ్రిటిష్ ప్రభుత్వము గతి యేమగునోయని భీతిల్లిరి.

ప్రసిద్ధ నాయకులందఱు పూనాలో సమావేశమై పర స్పరము సంప్రదించుకొని గాంధీజీతో చర్చించి ఉపవాసము ప్రారంభించిన నాలుగైదు రోజులకే అందరికీ అంగీకార యోగ్యమైన ఒక ఒప్పందమునకు వచ్చిరి. ఈ ఒప్పందమును బ్రిటిష్ ప్రభుత్వమువారికిని అంగీకరించక తప్పినదికాదు. ప్రత్యేక నియోజకవర్గ శాసనము రద్దుకాబడినది. సవర్ణ హిందువులతోపాటు హరిజనులుకూడా ఎన్నికలలోపాల్గొని తమ ప్రతినిధులను ఎన్నుకొనుటకు అవకాశము కల్పింప బడెను. ఈ విధముగా గాంధీజీ తమ ప్రాణములను ఒడ్డి హిందువులలోనే విభజన జరుగకుండా ఐక్యతను కాపాడెను. హిందూ ధర్మమునకు కళంకమగు అస్పృశ్యతను తొలగించు టకు కంకణము కట్టుకొనెను.

**హరిజనయాత్ర :**

జైలునుండి విడుదలైనపిమ్మట గాంధీజీ అస్పృశ్యతా నివారణ ప్రచారమునకు, హరిజనోద్ధరణకు నిధి వసూలు చేయుటకును దేశసంచారముచేసిరి. 1933 డిసెంబరు మాసంలో ఆంధ్రదేశమున పర్యటించిరి. ఆ రోజులలో మాగంటి బాపినీడుగారు హరిజన సేవకసంఘమునకు కార్యదర్శిగానుండిరి. డోర్నకల్లు రైలుస్టేషన్ వరకు వెళ్లి గాంధీజీని, వారి పరివారమును తోడ్కొని రావలసినదిగా వారు నాకు ఆజ్ఞాపించిరి. ఆ కాలములో నేను ఆంధ్రజాతీయ కళాశాల, మచిలీపట్నములో హిందీ ఉపాధ్యాయునిగా పనిచేయుచుంటిని. గాంధీ మహాత్ముని ఆంధ్రదేశమునకు ఆహ్వానించి, తోడ్కొనివచ్చు మహాభాగ్యము నాకబ్బినందులకు చాల హర్షించితిని. శ్రీ బాపినీడుగారికి కృతజ్ఞతాభివందనములు తెల్పి మచిలీపట్నమునుండి డోర్నకల్లుకు వెళ్ళితిని. వర్ధాలో బయలుదేరిన రైలు గాంధీజీ, వారిపరివారముతో ఆ రోజు ఉదయము సుమారు 5 గంటలకు డోర్నకల్లుస్టేషను చేరినది. నేను రైలులో మహాత్మా గాంధీజీని, వారి పరివారమును కలుసుకొని స్వాగతముచెప్పి వారికి, స్నానపానాదులకు వలయు ఏర్పాట్లుచేసితిని.

రైలు మరల స్టేషన్నుండి బయలుదేరినది. గాంధీజీ, వారిపరివారము 3 వ తరగతిలోనే ప్రయాణముచేయుచుండిరి. నేనునూ వారున్నపెట్టెలోనే గాంధీజీకి కొద్దిదూరముగ కూర్చుంటిని. ఆ రోజులలో గాంధీజీకి ప్రధానముగ కుమారి మీరాబెన్ (స్లేడ్ కన్య) గారు సేవాశుశ్రూషలు చేయు

చుండెడివారు. అది అరుణోదయవేళ. సూర్యభగవానుడు తన కిరణాలను ప్రసరిస్తూ ఉన్నాడు. ఆ కిరణాలు గాంధీజీ ముఖంమీదపడి వారి ముఖవర్చస్సును యినుమడింప జేయుచున్నవి. రైలు వేగాన్ని పుంజుకుంటున్నది. గాంధీజీ రైలు ప్రయాణములో రైలు వేగముగాపోవునపుడుకూడా చదువుకుంటారు, వ్రాసుకుంటారు, లేక రాట్నమైనా వడుకుతారు. ఆవేళ వారేదో వ్రాసుకొంటున్నారు. చల్లని పిల్లగాలులు వీస్తున్నవి. గాంధీజీ తలమీదనున్న నాలుగు పరకలు నృత్యముచేస్తున్నవి. ఈ దృశ్యము చూచేసరికి నాకు కీ. శే. బసవరాజు అప్పారావుగారు వ్రాసిన గేయము జ్ఞాపకము వచ్చినది.

"నాల్గుపరకల పిలక, నాట్యమాడే పిలక,
నాలుగువేదాల నాణ్యమెరిగిన పిలక."

"కొల్లాయికట్టితేనేమి ? మనగాంధి కోమటై పుట్టితేనేమి ?"

ఈ దృశ్యము చూచినపుడు నాకు కల్గిన ఆనందాన్ని యితరులకు చెప్పకుండా ఉండలేకపోయినాను. నాకు దగ్గరగానున్న మీరాబెన్ మొదలగువారికి ఆ గేయము వినిపించి హిందీలో దాని అర్థముచెప్పి ఆ దృశ్యమును వారికి చూపితిని. వారును ఆ దృశ్యమునుచూచి ఎంతయో ఆనందపడిరి. కవి యొక్క అద్భుత కల్పనాశక్తికి అచ్చెరువంది కవిని మిక్కిలి ప్రశంసించిరి.

మధ్యాహ్నం 1 గం. లోపల బండి బెజవాడ రైలు స్టేషనుకు చేరినది. వేలకొలది ప్రజలు మహాత్మాగాంధి దర్శ

నార్థమై రైల్వే ప్లాట్ ఫారంమీద నిరీక్షించుచుండిరి. రైలు బండి ప్లాట్ ఫారంను చేరగానే ఒక్కమారు ముందుకు త్రోసు కుంటూ జనసమూహము గాంధీజీఉన్న పెట్టెదగ్గరకు రాసాగినది. ఆ జనసమూహమును ఆపుట అక్కడనున్న స్వయం సేవకులకు కష్టసాధ్యమయినది. శ్రీ బులుసు సాంబమూర్తి గారు గాంధీజీకి స్వాగతంచెప్పి వారిని తీసుకొనివెళ్ళుటకు పెట్టెలోనికివచ్చిరి. ఆ ప్రజల ఉత్సాహమును, ఉద్రేకమును, కోలాహలమునుచూచి ఈ గుంపునుండి బయటకు వెళ్ళుటెట్లా యను తమ సంశయమును వెలిబుచ్చిరి. మహాత్మాజీ రైలు పెట్టె ద్వారముకడకువచ్చి ప్రజలకు దర్శనమిచ్చి దారి యివ్వవలసినదిగా ప్రజలను కోరిరి. ప్రజల ఆనందోత్సాహములు వెల్లివిరిసెను. 'మహాత్మాగాంధీకీ జయ్' యను విజయ ఘోషలు మిన్నుముట్టెను. ఈ దృశ్యమునుచూచి బాపూజీ, సాంబమూర్తిగారితో 'యహ్ సబ్ సాంబశివ్ కా ఉగ్ర స్వరూప్ హై,' (ఇదియంతయు సాంబశివుని ఉగ్రస్వరూపం) అనిరి. ఈ మాటలు సాంబమూర్తిగారి నుద్దేశించి చమత్కరించియన్నవో లేక ప్రజల ఆనందోత్సాహావేశములలో ఈశ్వరుని చిద్విలాసమే గోచరించినదో తెలియదు. గాంధీజీ దర్శనముచేసికొని ప్రజలు శాంతించి సర్దుకొని దారియిచ్చిన తరువాత గాంధీజీ స్టేషనుకు సమీపములోనున్న శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దుర్గాభవనమునకు వెళ్ళిరి. వెంటనే అక్కడ మహిళలకు ఏర్పాటుచేసిన సభలో గాంధీజీ ఉపన్యసించిరి. శ్రీమతి దుర్గాబాయిగారు వారి హిందీ ఉపన్యాసమును తెనుగులోని కనువదించిరి.

**గాంధీజీ తమ ఉపన్యాసములో :**

"అస్పృశ్యత - హిందూమతములోని ఒక వర్గమునకు చెందినవారిని అంటరానివారిగా భావించుట హిందూధర్మమునకు, మానవత్వమునకే కళంకమనియు, అస్పృశ్యతను తొలగించుటకు ముఖ్యముగ స్త్రీలే పూనుకొనవలయుననియు స్త్రీలు తలచుకున్న ఈ కార్యము సఫలము కాగలదనియు కనుక స్త్రీలు ముందుకువచ్చి యీ దురాచారమును రూపుమాపుటకు కృషిచేయవలయుననియు ఉద్బోధించిరి. తదుపరి హరిజనోద్ధరణకు హరిజనులకు సహాయముచేయుటకు కానుకలు, నగలు యివ్వవలసినదిగా గాంధీజీ వారిని కోరిరి. ఆ సభలో ఉన్న స్త్రీలు, పిల్లలు తమవద్దనున్న డబ్బు, నగలు వగైరా హరిజననిధికి గాంధిగారికి విరాళముగా సమర్పించిరి.

**గాంధీజీ మచిలీపట్నము బస**

ఈ సంచారములో గాంధీజీ, వారి పరివారము 193 డిసెంబరు 18 వ తేదీన మచిలీపట్నము వచ్చిరి. వారందరి ఆంధ్ర జాతీయకళాశాలలో బస ఏర్పాటు చేయబడెను. మహాత్మునికై ఆరోజు సాయంత్రము కళాశాల ఆవరణలో గొప్ప సన్మానసభ యేర్పాటు చేయబడెను. చల్లపల్లి రాజా శివరామప్రసాద్‌గారు సన్మాన సభాధ్యక్షులుగ నుండిరి. గాంధీజీకి సన్మానపత్రము సమర్పింపబడెను. గాంధీజీ హరిజనోద్ధరణ, అస్పృశ్యతానివారణ గురించి ఉపన్యసించి హరిజననిధికి విరాళములు కోరిరి. రాజాగారు సన్మానసభ పక్షమునన స్వయముగను కొంత నిధిని సమర్పించిరి. సభలో ఉన్న ప్రజలును కానుక లొసగిరి. రెండు మూడు రోజులు కళాశాలల

బస ఏర్పాటుచేసుకొని గాంధీజీ జిల్లాలోని పలుగ్రామములలో సంచారంచేసి హరిజన నిధికి విరాళములు వసూలుచేసిరి. ఈ నిధివసూలు చేయుటకు శ్రీయుతులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, చెలుకువాడ వెంకటనరసింహం మొదలగు ప్రముఖ నాయకులు తోడ్పడిరి. ఈ నిధిని వసూలు చేయుటలో ఒక్కొక్కప్పుడు దారిలో దర్శనార్థమైవచ్చిన ప్రజలాటంకపరచుటచే కార్యక్రమములో నిర్ణయించిన గ్రామములకు చేరుట చాల ఆలస్యమయ్యెడిది. అయినను, నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఎంతప్రొద్దుపోయిననూ ఆ గ్రామాలకు వెళ్ళెడివారు. గాంధీజీకి విశ్రాంతి ఉండెడిది కాదు. మార్గమధ్యములో ప్రయాణము చేయుచున్నపుడే ఒకగ్రామమునుండి మరొక గ్రామమునకెంత దూరమున్నదో ఆ గ్రామమును చేరుట కెంతసమయముపట్టునో తెలుసుకొని గాంధీజీ కారులోనే నిద్రపోయెడివారు. సరిగా నిర్ణీత సమయానికి మేల్కాంచెడివారు. వారియందున్న ఆత్మనిగ్రహము నకుగల అపారశక్తి ఇది.

మహాత్మగాంధీజీ ఎక్కడఉంటే అదే ఆశ్రమము. వారు, వారి యనుచరులు ఆశ్రమ నియమముల ననుసరించి ఉదయము, సాయంత్రము నియమిత సమయములలో సామూహిక ప్రార్థనలు చేయుచుండెడివారు. రాట్నంవడుకుచుండెడివారు. ఉదయం, సాయంత్రం జరుగుప్రార్థనలలో కళాశాలలోని విద్యార్థులు, ఉపాధ్యాయులేగాక పట్టణములోని పౌరులు గూడా పాల్గొనుచుండెడివారు. మహాత్ముని సందర్శించుటకిది మంచియదను. కనుక అశేష జనము ప్రార్థనయందాసక్తి

కంటె గాంధీజీని దర్శించుటకే ఈ ప్రార్థనలో పాల్గొనేవారు. కళాశాలలోనున్న మూడురోజులు గాంధీజీ కార్యక్రమం ప్రశాంతంగా జరిగిపోయినది. కళాశాల పట్టణానికి వెలుపల సుమారు 40, 50ఎకరాల విశాలమైనస్థలంలో ఉన్నది. ప్రశాంతమైన ఈ వాతావరణంలో పట్టణంలోని రొద ఏమియు ఉండదు. కాని అదివరలో ఆ విశాలమైన స్థలంచుట్టు ప్రకృతిసిద్ధమైన నాగజెముడు వ్యాపించియుంకుటచే పశువులు వగైరాలు ఆవరణలోనికిరాకుండ పెట్టనికోటగాకాపాడుచుండెడిది. కాని, ఆ నాగజెముడు యిటీవల ఏదో పురుగుతగిలి నశించిపోయినది. అంతవిశాలమైన ఆవరణలో పశువులు, గాడిదలు రాకుండ కంచెవేసి కాపాడుటకు కళాశాలవారికి ఆర్థిక యిబ్బందులచే సాధ్యముకాకుండెను. ఆ ప్రశాంతత అప్పుడప్పుడు గాడిదలు ఓండ్రపెట్టుటచే భంగమగుచుండెడిది. ఇదియే యొక బాధాకరమైన విషయంగా మేము భావించుచుండెడివారము. ఒకరోజు ఉదయమున గాంధీజీ వరండాలో తిరుగుచుండెను. ఇంతలో గాడిద ఓండ్రపెట్టెను. అది విని గాంధీజీ "అచ్ఛా! అచ్ఛా! బహుత్ సురీలా హై" 'బాగు బాగు! చాలా శ్రావ్యంగానున్నదే' యని అనుకొనుచుండిరి. నేనపుడక్కడే యుంటిని. వెంటనే నేను అందుకొని "బాపూజీ! మా యాంధ్రదేశంలో ఆదిభట్ల నారాయణదాసుగారని ఒక ప్రసిద్ధ హరికథకులున్నారు. వారు గాడిద పెట్టు అరుపుకు ఈ విధంగా అర్థం చెప్పినారు: "గాడిద మొదట 'ఖుదా హై' అంటుందని తరువాత దానికి సందేహంకల్గి హైకి నహీం? హైకి నహీం! హైకి నహీంఉన్నాడా

ఉన్నాడా లేడా ? ఉన్నాడా లేడా ?)అని, చివరకు హై, హై, లేడా? హై (ఉన్నాడు, ఉన్నాడు, ఉన్నాడు) అను నిర్ణయానికి వస్తుందని ఇంచుమించుగా నాగాడిదస్వరాన్నే అనుసరిస్తూ అంటిని. గాంధీజీ విని పకపక నవ్వి వ్యాఖ్య బాగున్న దన్నాడు. గాంధీజీతో ఇట్లు ఛలోక్తులాడుటకు నాకు సాహస మెట్లు కలిగెనాయని ఆశ్చర్యపడితిని. ఇంతచనువుగా మాట్లా డుటకు కారణము వారి సౌజన్యమే, వారి వినోద ప్రియత్వమే. ఒకమారు శ్రీ బులుసు సాంబమూర్తిగారు గాంధీజీతో నిట్లనిరి. "నేను తప్పులులెక్క చేయకుండా హిందీలోనే మాట్లాడు చున్నాను." వెంటనే గాంధీజీ మీరు "హిందీ ఏమిటి? ఇంగ్లీషు కూడా తప్పులు లెక్కచేయకుండానే మాట్లాడగలరు" అనిఅనే టప్పటికి అక్కడున్నవారందరూ ఫక్కున నవ్విరి. సమయము ననుసరించి గాంధీజీ యిట్లు వినోదమాడుచుండెడివారు. ఎంతో కార్యభారంతో మునిగియున్ననూ గాంధీజీకి వినోద ప్రియ త్వమే ఆ భారమును తగ్గించుసాధనమగుచున్నది. అందులోనే వారికి విశ్రాంతి, ఆనందం కల్గుచున్నది.

# 18

## గాంధీజీతో నా ఉత్తరప్రత్యుత్తరములు

మహాత్మగాంధీ ఆంధ్ర జాతీయ కళాశాలలో రెండు మూడు రోజులున్నను వారితో మాట్లాడుటకు నాకు అవకా శము కలుగలేదు. వారికి తీరిక, విశ్రాంతి ఉండెడిదికాదు. వారు నిర్విరామముగా పనిచేయుట, ప్రయాణముచేయుట కనులారా చూచుచు వారు కొంచెముసేపు విశ్రాంతి తీసు

కొన్నపుడు వారిని శ్రమపెట్టుటకు నాకు మనస్కరించక పోయెను. వారు కళాశాలనుండి వెళ్ళునపుడు నాకుగల ధర్మ సందేహములను వ్రాసి ఆ కాగితమును మహాత్మునకొసగి తమకు తీరికయున్నప్పుడు ఇందులోని విషయములకు సమాధానము వ్రాయించవలసిందిగా వారికి విన్నవించితిని. నాకాగితమును వారు తీసికొనివెళ్ళి అందులోని విషయములన్నిటికిని వారు సంచారముచేయునపుడే 10, 12 రోజులకే కడప నుండి 2-1-1934 న నాకు ప్రత్యుత్తరము వ్రాయించిరి. గాంధీజీకి వ్రాసిన ఉత్తరము, వారు వ్రాసిన జవాబును వ్రాయుచున్నాను.

1. ప్రశ్న :- ధర్మార్థములు ఒక వ్యక్తికి, సమాజానికి, దేశానికి సమన్వయించవచ్చునా? అనగా ధర్మము, అర్థము రెండింటినీ ఒకే పర్యాయము పొందవచ్చునా? అది సాధ్యమా? ఆధ్యాత్మిక సంపదగల సత్పురుషుడు దరిద్రుడుగను, ధనవంతునకు ఆధ్యాత్మిక జ్ఞానములేకుండుటయు మనము చూచుచున్నాము.

జవాబు :- ధర్మార్థములు ఒక వ్యక్తిగాని, సమాజంగాని, దేశంగాని పొందవచ్చును. ఇందు సందేహ మెంతమాత్రము లేదు. కాని ధర్మార్థముల ఐక్యత ఎప్పుడు కల్గునో చెప్పుట దుర్లభము.

2. ప్రశ్న :- ఫలత్యాగముచేసి కృషిచేసినవానికి తప్పక ఫలములభించునని చెప్పుచున్నారు. ఇదిసాధ్యమా? ఇది తమ అనుభవములోని విషయమేనా? నిరంతరం కష్టించి పనిచేసి

ధాన్యమును పండించు రైతుకు కడుపునిండ అన్నము లభించ కుండుట, మనము సమాజములో చూచుచున్నాము. ఆకలితో మాడు రైతుకు ఆత్మజ్ఞాన మెట్లు కల్గును?

జవాబు : ఫలాన్ని త్యజించు విషయములో నేను వ్రాసినదంతయు అనుభవసిద్ధమే. ఇది ఒకసారి కల్గిన అనుభవముకాదు. ఎన్నోసార్లు నాకు అనుభవం కల్గినది. చాలా శ్రమపడుచూ ఆకలితో మాడుచున్న రైతు ఆత్మజ్ఞానము పొందగలడు. కాని ఎక్కువ శరీరబలము, మిక్కిలి బుద్ధిబలము గల ధనవంతునికి ఆత్మజ్ఞానము కల్గుట అసంభవము కాకపోయిననూ, దుర్లభమని అనుభవజ్ఞులు చెప్పుదురు.

3 వ ప్రశ్న : ఈశ్వరస్వరూపమన నేమి? ప్రార్థనల వలన ఈశ్వరుడు మన కోరికలు నెరవేర్చునా? ప్రార్థనవలన ప్రయోజనమేమి?

జవాబు : జగత్తులో సర్వవ్యాప్తమైన చైతన్యవంతమైన యొక శక్తి యున్నది. ఆ శక్తిని ప్రార్థించుట అవసరము. ఆ శక్తి మనకోరికల నన్నింటిని నెరవేర్చదు. అందును గురించి మనము విచారింప పనిలేదు.

4 వ ప్రశ్న : భగవద్గీతకు అనేకులు అనేకార్థములు చెప్పుచున్నారు. ఏ వ్యాఖ్య సరియైనది?

జవాబు : మన ఇష్టమువచ్చినట్లు గీతకు వ్యాఖ్యానము చెప్పుటకు వీలులేదు. వ్యాకరణాదుల ననుసరించియే అర్థము చెప్పవలెను.

5 వ ప్రశ్న : ఈశ్వరత్వము పొందుట యనగానేమి?

జవాబు : ఈశ్వరరూపమును పొందుట యనుదాని యర్థము స్పష్టమే. పుత్రుడు తండ్రిరూపమును పొంద గోరును. అప్పుడుగాని యతనికి సంతృప్తి కలుగదు. భక్తుడు కూడా భగవంతుని రూపమును పొందవలెనని యాశించును. అప్పుడుకాని జన్మ సార్థకము కాదు. ఆ జీవికి తృప్తికలుగదు.

మహాత్మ గాంధీజీ ఉదయము నాల్గు గంటలకే లేచి సాధారణముగా రాత్రి 9, 10 గం॥ వరకు నిర్విరామముగ పనిచేయుచుందురు. నాబోటి సామాన్య కార్యకర్తలు వ్రాసిన ఉత్తరములకు, అందు వారిని విమర్శించుచు వ్రాసిన విష యములకుకూడ తప్పక జవాబు వ్రాసెడివారు. నే నొకప్పుడు వారి కుటుంబమునకు సంబంధించిన విషయము వ్రాసితిని. నేను వ్రాసిన లేఖను, వారి ప్రత్యుత్తరమును ఇందు పొందుపరచుచున్నాను.

మచిలీపట్టణము
3-3-28

పూజ్య మహాత్మా గాంధీజీ!

హృదయపూర్వక నమస్కారాలు

(1) ప్రస్తుతము వాడుకలోనున్న రాట్నము, ఖద్దరును విరివిగా ప్రచారముచేయుటకు ఎక్కువగా ఉపయోగ పడునట్లు తోచదు. ఈ రాట్నముమీద 7, 8 గంటలు నూలు వడికిననూ రెండణాలకంటె ఎక్కువ కూలి గిట్టుట లేదు. ఈ రాట్నముమీద వడికినదానికంటె కనీసము నాలు గైదురెట్లు నూలు రాగల నూతన రాట్నమును కనిపెట్టినగాని రాట్నముమీద నూలు వడకువానికి తగిన కూలి లభించదు.

ఈ పరిశ్రమ స్వయంపోషకము కాజాలదు. కనుక, అట్టి నూతన రాట్నమును కనిపెట్టినవానికి బహుమతి యొసంగ బడునని ప్రకటించి ప్రోత్సహించుట బాగుండునేమో.

(2) మీ కుమారుడు రామదాసునకు వివాహము చేయు నట్లు పత్రికలలో చదివితిని. స్వరాజ్యము వచ్చువరకు వివాహము చేసుకొనవలదనియు, బ్రహ్మచర్యవ్రత మవలంబింప వలెననియు మీరు బోధించుచున్నారుగదా ? మీ కుమారుని కిపు డెందుకు వివాహము చేయుచున్నారు ?

భవదీయ విధేయుడు,
ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

మహాత్ముని జవాబు

సబర్మతీ ఆశ్రమము
11-3-28

మహాశయా,

1. మీ ఉత్తరం గాంధీగారు చూచినారు. మీరు కోరి నట్లు కొత్తరాట్నము కనుగొన్నవారికి రు 5000/-లు బహుమతియివ్వబడునని ఇదివరలోనే 'నవజీవన్', 'యంగ్ ఇండియా' పత్రికలలో ప్రకటించినాము. చాలామంది ప్రయోగములు చేయుచున్నారు. 2. బ్రహ్మచర్యవ్రతము పాలింపదలచిన వారే అవివాహితులుగా నుండెదరు. గాంధీజీ తమ కుమారునికి కూడా సలహా యిచ్చినారు. ఆ కన్యను వివాహమాడుటకు సంబంధము నాల్గుసంవత్సరములకు పూర్వమే నిశ్చయింప బడినది.

భవదీయుడు,
(సం.) మహాదేవ దేశాయి

## 19

## సేవాగ్రామ ఆశ్రమ సందర్శనము

మహాత్మ గాంధీజీ గుజరాతు రాష్ట్రములో అహ మ్మదాబాదు పట్టణ సమీపమున సబర్మతీ నదీ తీరమున 1916 వ సంవత్సరములో సబర్మతీ సత్యాగ్రహాశ్రమమును స్థాపించిరి. 1930 వ సంవత్సరము మార్చి 12 వ తేదీన ఆ ఆశ్రమములోని 79 మంది సత్యాగ్రహయోధులను వెంట నిడుకొని పాదచారియై 215 మైళ్ళ దూరములో అరేబియన్ సముద్రతీరముననున్న దండి వద్దకు బ్రిటిష్ ప్రభుత్వమువారి ఉప్పుశాసనము నుల్లంఘించి సముద్రపునీటితో ఉప్పు చేయు టకు వెడలిరి. సబర్మతీఆశ్రమమును విడుచునపుడు, స్వారాజ్య మును సంపాదించిన పిమ్మటనే ఈ ఆశ్రమమునకు వచ్చుట యను శపథమును పూనిరి. ఏప్రిల్ 6 వ తేదీన దండివద్ద ఉప్పు శాసనమును ఉల్లంఘించి ఉప్పు చేయుటయు, తదుపరి దేశమంతట పలుచోట్ల ఉప్పుశాసనోల్లంఘనము జరుగుటయు, ఈ శాసనోల్లంఘనము చేసినవారిని ప్రభుత్వమువారు నిర్బం ధించి వారికి జైలుశిక్షలు, జరిమానాలు విధించుటయు చరిత్రప్రసిద్ధమగు విషయమే.

1930 - 31 వ సంవత్సరములో మహాత్మా గాంధీజీ సంకల్పించినప్రకారము స్వారాజ్యం లభించలేదు. తన ప్రతిజ్ఞ ప్రకారం మహాత్మాజీ సబర్మతీఆశ్రమమునకు తిరిగివెళ్ళలేదు.

వారు కొంతకాలం వర్ధాలో నుండి వర్ధా సమీపమున నాలుగైదు మైళ్ళలోనున్న 'సేగాంవ్' గ్రామంవద్ద శ్రీ జమ్నా

లాల్ బజాజ్ గారి తోటలో 'సేవాగ్రాం' అను ఆశ్రమమును స్థాపించిరి. ఈ ఆశ్రమములో మహాత్మగాంధి, మాతా కస్తూరిబా, మహాదేవ దేశాయి, శ్రీశ్రీ ఆర్యనాయకం, శ్రీమతి ఆశాదేవి, శ్రీ కిశోరిలాల్ మశ్రువాలా, శ్రీ వినోబాభావే, శ్రీ కాకా కాలేల్కర్ మొదలగు ప్రముఖులుండెడివారు. ఈ ఆశ్రమములో మహాత్మ గాంధికి ప్రియమైన నిర్మాణకార్యక్రమ సంస్థలన్నియు (ఖాదీసంస్థ, గోసేవా సంఘము, హిందీ ప్రచారసభ, నయీతాలీమ్ లేక బేసిక్ విద్య, మహిళాశ్రమ్ మొదలగునవి) స్థాపింపబడినవి. ఆయా కార్యక్రమములు సక్రమంగా నెరవేర్పబడుచుండెడివి.

గాంధీజీ కుటీరము

సేవాగ్రామంలోని గాంధీజీ కుటీరము చాలా చిన్నది. మట్టితో కట్టిన గోడలు, గ్రామంలో తయారైన పెంకులతో పైకప్పు, గోడలను పేడతో అలికి పరిశుభ్రముగా నుంచెడివారు. గాంధీజీ చాపలమీదనే పద్మాసనము వేసికొని కూర్చుండెడివారు. వ్రాసుకొనుటకు ముందొక చిన్న బల్ల యుండెడిది. ఆ బల్లమీద జపానువారు బహూకరించిన మూడుకోతుల బొమ్మ యుండెడిది. ఆ కోతులు, ఒకటి కండ్లుమూసుకొని, మరొకటి చెవులు మూసుకొని, మూడవది నోరు మూసికొని ఉండును. వీటి అర్థమేమన, చెడును చూడరాదు, చెడును వినరాదు, చెడును మాట్లాడరాదు. మహాత్ముని యాదర్శమిదియే. అందులకే వారెల్లప్పుడును మూడు కోతులబొమ్మను తమయెదుట నుంచుకొనెడివారు.

మహాత్మాజీ 1942 వ సంవత్సరంలో ప్రారంభించిన 'క్విట్ ఇండియా ఉద్యమము' (బ్రిటిష్‌వారు భారత దేశమును విడిచిపోవలెను) లో దేశనాయకులందరను – మహాత్మా గాంధీజీ, శ్రీమతి కస్తూరిబాగాంధీ, మహాదేవదేశాయి, జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభభాయిపటేల్, బాబూరాజేంద్ర ప్రసాద్ మొదలగువారిని – ప్రభుత్వమువారు నిర్బంధించి కారాగారమున నుంచిరి. జైలునందే మహాత్మగాంధి సహధర్మచారిణి శ్రీమతి కస్తూరిబాగాంధి, మహాత్మాజీ ఆంతరంగిక కార్యదర్శి శ్రీ మహాదేవదేశాయి పరమపదించిరి. 1944 మే నెలలో గాంధీజీని కారాగారమునుండి విడుదల చేసిరి.

**అఖిలభారత హిందీ ప్రచార సమ్మేళనము**

1945 ఫిబ్రవరి 26, 27 తేదీలలో సేవాగ్రాంలో గాంధీజీ అధ్యక్షతన అఖిలభారత హిందీప్రచార సమ్మేళనము జరిగెను. అందు దక్షిణభారత హిందీప్రచారసభ ప్రధాన కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణగారు, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘమున నేనునూ ప్రతినిధులుగా పాల్గొంటిమి. నాకు ప్రథమముగా ఆశ్రమమును దర్శించుభాగ్యము కలిగెను. ఆశ్రమ వాతావరణములో గాంధీజీ కుటీరమునకు సమీపమునగల చెట్టుక్రింద ఉదయము, సాయంత్రము ప్రార్థనలు జరుగుచుండెడివి. ఆ రెండురోజులు మేము ఆశ్రమములోనుంటిమి. ఆశ్రమవాసులతోనే సాత్వికాహారము భుజించితిమి. గాంధీజీ ప్రేమతో నొసగిన ఆతిథ్యము మరపురానిది. ఆశ్రమవాసులందరు ఎవరిపనులు

వారు చేసుకొనుచుందురు. ఎవరుతిన్న విస్తరినిగాని, పళ్ళెమునుగాని వారే శుభ్రముచేసికొనవలయును. సాధ్యమైనంత వరకు ఇతరులమీద ఆధారపడక తమ పనులన్నియు తామే చేసికొనుచు, ఇతరులకు కొంతవరకు సహాయపడుటలోనే నిజమైన ఆత్మానందము కలదు.

ఒకరోజు సాయంత్రము గాలివాన వచ్చెను. అచ్చట విద్యుద్దీపములు లేవు. హరికేన్ లాంతరులనే ఆశ్రమంలో ఉపయోగింతురు. గాలికి దీపము లాగలేదు. అంధకారమయము, పైగా గాలివాన. ఆ పరిస్థితి చాలా బాధాకరముగ నుండెను. అప్పుడు నేననుకొంటిని – మహాత్ముని తపస్సు ఎంత కఠోరమైనది! వారిదీక్ష ఎంత అకుంఠితమైనది! వారు కోరి తెచ్చుకొన్న పరిస్థితులేగదా యివి! వారు కోరినచో అక్కడ విద్యుద్దీపములు అమర్చబడెడివి. గాలివానకు ఇబ్బంది పడకుండ బంగళాలో నివసించెడివారుగదా! భారతీయులలో అశేషజనము – నూటికి తొంబదిమంది – అనుభవించు ఇటువంటి కష్టములలో పాల్గొనుటలోనే మహాత్మునికి ఆనందముకలదు. కట్టుకొనుటకు చాలినంత బట్టలులేని బీదల దుస్థితిని చూచియేగదా తానునూ యొక అంగవస్త్రము మాత్రమే ధరించి జీవితము గడుపుచున్నారు. చివరకు 1931 వ సంవత్సరంలో ఇంగ్లండులో జరిగిన "రౌండ్ టేబుల్" సమావేశమునకుగూడా తాను దరిద్రభారతదేశమునకు నిజమైన ప్రతినిధిగా కొల్లాయిగుడ్డతోనే వెళ్ళిరి. బ్రిటిష్ ప్రభుత్వమువారు నవనాగరికత యనబడే దుస్తులు – హ్యాట్, బూట్, సూట్ – ధరించినగాని రౌండ్ టేబుల్ సమావేశ

ములో పాల్గొనుటకు వీలులేదన్నచో అందు పాల్గొననే పాల్గొనననని గాంధీజీ సమాధాన మొసంగిరి. కాని, చివరకు గాంధీజీ తను మామూలుగా ధరించు దుస్తులతోనే రౌండ్ టేబుల్ సమావేశమునకు హాజరైరి. గాంధీజీ సంకల్పము వజ్రసమానము. ఇది బ్రిటిష్ చరిత్రలో నొక యపూర్వ ఘటన. గాంధీజీ సామాన్య భారతీయులతో తాదాత్మ్యము పొందినారు.

మహాత్ముని అధ్యక్షతన హిందీప్రచార సమ్మేళనము రెండురోజులు జరిగినది. హిందీప్రచారాభివృద్ధికి దోహద కారులైన అనేక తీర్మానములు గావింపబడినవి.

మహాత్మగాంధీజీ స్వాగతవచనములుగా పల్కిన పలుకులు మరపురానివి. అప్పటికింకనూ శ్రీయుతులు పండిట్ జవహర్లాల్ నెహ్రూ, డాక్టరు భోగరాజు పట్టాభి సీతా రామయ్య, అబుల్ కలామ్ ఆజాద్, వల్లభభాయి పటేల్, శ్రీ రాజేంద్రప్రసాద్, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు మొదలగు దేశనాయకులందరు జైళ్లలో మ్రగ్గు చున్నారు. గాంధీజీ వారి నందరినీ తలచుకొని తమ అధ్య క్షోపన్యాసములో గద్గదస్వరముతో నిట్లనిరి – "ఇంకనూ పైన పేర్కొన్న నాయకులందరు, జైళ్లలో కష్టములపాలగు చున్నారు. వారినందరిని విడుదల చెయ్యమని నేను బ్రిటిష్ ప్రభుత్వమును యాచించను. మనము నిర్మాణ కార్యక్రమ మును శ్రద్ధగా, జయప్రదముగా నిర్వహించిన మన శక్తి యినుమడించును. అపుడు వారంతటవారే విడుదలపొందెదరు.

అంతేగాని, వారందరూ చెఱసాలలో మరణించినను సరే, ప్రభుత్వమును విడుదలచెయ్యమని యాచించను." కరుణా పూరితమైన గాంధీజీ యీ వాక్కులు అక్కడ నున్న సభ్యులందరి హృదయములను కదలించినవి. గాంధీజీ ధర్మపత్నియగు కస్తూరిబాగాంధి, సహచరుడైన మహాదేవ దేశాయి చెఱసాలలోనే యసువులు బాసిరి. బహుశః గాంధీజీకి ఈ సందర్భమున ఆ సంఘటనలన్నియు జ్ఞాపకము వచ్చుటచే తమ హృదయావేదనను వెలిబుచ్చియుందురు. దేశభవిష్యత్తు అప్పటికి వారికి అంధకారబంధురముగా తోచియుండును. కనుకనే సహచరుల కష్టపరంపరలను తలచుకొని పరితప్త హృదయముతో హృదయవిదారకమగు వచనములు పలికెను. ఆ దృశ్యము సమావేశమైనవారి నందరిని కదల్చెను. సహచరులయందు వారికిగల యనురాగ మెట్టిదో గోచరమైనది.

# 20

## ఆంధ్రదేశములో అంతిమ పర్యటన

### దక్షిణభారత హిందీ ప్రచార సభ రజతజయంతి మహోత్సవములు

1918 సం. లో ఇండోరులో హిందీ సాహిత్యసమ్మేళనము మహాత్మగాంధిగారి అధ్యక్షతను జరిగినది. ఆ సభలోనే దక్షిణభారతదేశంలో ఆంధ్ర, కర్నాటక, కేరళ, తమిళ ప్రాంతములలో హిందీ ప్రచారము గావింపవలెనని తీర్మానము చేసిరి. మహాత్మగాంధి కర్మయోగి కదా. తీర్మానము అంగీకరింపబడినతరువాత దానిని ఉన్న సాధనసంపత్తితో ఆచరణలో పెట్టవలెగాని మిన్నకుండు

వారు కారు. కనుక వెంటనే తమ కుమారులు శ్రీ దేవదాసు గాంధిగారిని మద్రాసుకు పంపి, హిందీతరగతుల నారంభింప చేయుటతో హిందీ ప్రచారము ప్రారంభింపబడెను. తదుపరి 25 సంవత్సరములలో హిందీప్రచారోద్యమము దక్షిణ దేశములోని నాలుగు ప్రాంతములలోను విరివిగా సాగెను. ప్రతి పట్టణములోను, కొన్ని పల్లెలలోను హిందీ పాఠశాలలు, హిందీప్రచారకమండలులు, హిందీప్రేమీమండలులు, హిందీ నాటక సమాజములు నెలకొల్పబడినవి. వానిద్వారా మూల మూల గ్రామములకు హిందీ వ్యాపించెను. దక్షిణభారత హిందీ ప్రచారసభ ప్రారంభించి 1943 వ సంవత్సరమునకు ఇరువదయిదు సంవత్సరములు పూర్తియాయెను. హిందీ ప్రచారసభ రజతజయంత్యుత్సవములు జరుపవలయునని తీర్మానింపబడెను. కాని గాంధిమహాత్ములును, యితర దేశ నాయకులును కారాగారములలో ఉండుటవలన అప్పుడు రజత జయంతి ఉత్సవములు జరుపుటకు వీలుకాకపోయెను. 1946 జనవరి నెలలో ఆ ఉత్సవములు జరుపుటకు నిశ్చయింపబడెను. మహాత్మగాంధిగారు అందు పాల్గొనుటకు అంగీకరించిరి. దక్షిణభారత హిందీ ప్రచారసభకు మహాత్మ గాంధియే అధ్యక్షులు. వారు ఈ సభకు రజతజయంతి ఉత్సవములో పాల్గొనుటకు తీరిక చేసుకొని రావటం అపూర్వమైన విషయము. ఈ ఉత్సవములను హిందీప్రచారసభ ప్రధాన కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణగారు, కార్యకారిణీసమితి సభ్యుల సహకారంతోను, పట్టణంలోని ప్రముఖుల సహాయంతోను భారీయెత్తున ఏర్పాట్లుచేసిరి. ఈ రజతజయంత్యుత్సవ

ములను పురస్కరించుకొని వారంరోజులు సభావరణలో నిర్మాణకార్యక్రమములతో వివిధ అంశములకు సంబంధించిన సభలు జరిగినవి. స్త్రీల సభలు, కార్మిక సభలు, విద్యార్థుల సభలు, హరిజనాభ్యుదయ సభలు, కవి సమ్మేళనము - మొదలగునవి జయప్రదంగా జరిగినవి. హిందీ ప్రచారసభ, స్నాతకుల పట్టప్రదాన మహోత్సవమును జరిగినది.

మద్రాసుకు ప్రయాణము

మహాత్మగాంధి, వారి పరివారముతో దక్షిణభారత హిందీ ప్రచార సభ రజతజయంతిమహోత్సవములలో పాల్గొనుటకుగాను స్పెషల్ రైలులో ది 19-1-46 మధ్యాహ్నము 2-30 గంటలకు కలకత్తానుండి బయలుదేరిరి. కలకత్తానుండి మద్రాసుకు సుమారు పదకొండువందలమైళ్లు. 50 గంటలు ప్రయాణముచేసి, దారిలో ముఖ్యమైన స్టేషనులలో ఆగుతూ, సుమారు పదిలక్షలమందికి దర్శనమిచ్చి - వారికి సందేశమిస్తూ, 21 వ తేదీ సాయంత్రం 4-30 గంటలకు మద్రాసు చేరిరి. గాంధీజీ ప్రయాణంచేసిన స్పెషలు రైలును 'పోస్టల్ ఎక్స్‌ప్రెస్' అని పేరు పెట్టారు. ఈ స్పెషల్ రైలుకు ఒక మూడవతరగతి పెట్టె, ఒక రెండవ తరగతిపెట్టె అమర్చారు. వాల్తేరు వచ్చినతరువాత ఆరైలు మరిరెండు బోగీలు తగిల్చారు. జాతీయపతాకాలు, మామిడి తోరణాలతో రైలును అలంకరించారు. గాంధీగారిబృందంలో సుమారు ఇరవై మంది వారివెంట వచ్చారు. ఇంగ్లండునుంచి మహాత్ముని చూడవచ్చిన మిస్ అగధహారిజన్, శ్రీ జయప్రకాశ్ నారాయణ్ భార్య శ్రీమతి ప్రభావతీదేవి, డాక్టర

సుశీలానయ్యర్, గాంధీజీ అంతరంగిక కార్యదర్శి శ్రీ ప్యారీలాల్, దక్షిణాఫ్రికానుండి వచ్చిన మహాత్మ గాంధి కుమారుడు శ్రీ మణిలాల్ గాంధి, శ్రీ కనూగాంధి, శ్రీమతి ఆభా గాంధి, శ్రీ రామకృష్ణబజాజ్, శ్రీమతి రాజకుమారి అమృతకౌర్, శ్రీ భరతన్ కుమారప్ప, శ్రీ సుధీర్ బాబు, శ్రీ జమ్నా దాస్ గాంధి మొదలగువారందరు ఉన్నారు. మహాత్మునికి పరిచర్యలు, కావలసిన వస్తువులను సమకూర్చుట ముఖ్యముగ శ్రీమతి ప్రభావతీదేవి, డాక్టర్ సుశీలానయ్యర్, శ్రీ కనూ గాంధి చూస్తుండేవారు.

మహాత్మ గాంధి 1934 సం. లో హరిజనోద్ధరణ యాత్రకై ఆంధ్రదేశమునకు వచ్చిరి. తిరిగి పన్నెండు సంవత్సరముల అనంతరము 1946 సం. లో హిందీ ప్రచారోద్యమమునకై ఆంధ్రదేశము వచ్చిరి. ఈలోగా-అనగా యీ పన్నెండు సంవత్సరములలో దేశంలో అనేక మార్పులు జరిగినవి. పరిస్థితులు మారినవి. 1940-42 సంవత్సరములలో వ్యక్తిసత్యాగ్రహము, బ్రిటిష్ ప్రభుత్వమువారు భారతదేశమును విడిచిపోవలయునను 'క్విట్ ఇండియా' మహోద్యమము జరుగుటయు, ప్రభుత్వమువారు నాయకులను, ప్రజలను నిర్బంధించుటయు, మరల రాజీ ప్రయత్నమునకై నాయకులను, సత్యాగ్రహులను 1945-46 లో విడుదల చేయుటయు జరిగినది. మహాత్ముడు ఆంధ్రదేశమునకు వచ్చుచున్నారని విని ఆంధ్ర ప్రజలందరు వారి దర్శనము చేసుకొని వారి సందేశమును వినుటకై ఆతురతతో నిరీక్షించిరి. ఈ యాత్రలో మహాత్మ గాంధి గ్రామములలోను, పట్టణముల

లోను సంచారము చేయలేదు. స్పెషల్ రైలు ఆగిన రైలు స్టేషనుల సమీపములోనే ఏర్పాటు చేసిన వేదికనుండియే వారు దర్శనమిచ్చి, సందేశమిచ్చిరి. ఆ స్టేషనులవద్దకే జను లందరు వచ్చి వారి దర్శనభాగ్య మబ్బినందులకు తమను ధన్యులుగా తలచిరి. ఈ సంచారములో హరిజననిధికి, హిందీ ప్రచారనిధికి విరాళములు వసూలుచేసిరి.

స్పెషల్ రైలు బరంపురం, ఇచ్ఛాపురం స్టేషనులలో ఆగింది. అక్కడి ప్రజలు మహాత్ముని దర్శనము చేసికొని కానుకలర్పించిరి. ఉత్తర విశాఖజిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ గౌతు లచ్చన్నగారు ఇచ్ఛాపురం వెళ్ళి మహాత్ములకు స్వాగతం చెప్పారు.

### వాల్తేరులో మహాత్ముని కలుసుకొనుట

గాంధీజీ ప్రత్యేక రైలు వాల్తేరు 20 వ తేదీ ఉదయం సుమారు పదిగంటలకు చేరింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు నెల్లిమర్ల లోనే కలుసుకొని మహాత్మునికి స్వాగతం చెప్పారు. వాల్తే రులో శ్రీ తెన్నేటి విశ్వనాథంగారున్నూ, ఆంధ్రరాష్ట్ర హింద ప్రచారసంఘపక్షమున, దక్షిణభారత హిందీప్రచార సభ రజత జయంతి ఉత్సవసమితి పక్షాన నేనున్నూ స్వాగతం చెప్పితిమి. తూర్పుగోదావరిజిల్లా నాయకులు శ్రీ మల్లిపూడి పళ్ళంరాజు, శ్రీ చెలికాని బుచ్చివెంకట్రావు, శ్రీ పైడ వెంకటనారాయణ జమీందారు మొదలగు ప్రముఖు మహాత్మునికి, వారి పరివారానికి స్వాగతం చెప్పారు.

వాల్తేరులో స్టేషనుకు 2-3 ఫర్లాంగుల సమీపంలో ఉన్న బి. యన్. ఆర్. ఇన్‌స్టిట్యూట్ గ్రౌండ్సులో గొప్పబహిరంగసభ జరిగినది. ఈ యాత్రలో రైలుస్టేషనుకు దూరంగా ఏర్పాటుచేసిన బహిరంగసభలో గాంధీజీ ఉపన్యసించినది ఈ సభలోనే. మిగిలినచోట్ల కొన్ని స్టేషనులలో రైలులోనే ఉండి రైలుస్టేషనుకు వచ్చినవారికి తమ దర్శనమిచ్చి సందేశమిచ్చిరి. మరికొన్నిచోట్ల రైలుస్టేషను సమీపములో ఏర్పాటు చేసిన వేదికపై ఉండి ఉపన్యసించిరి. గాంధీజీ ప్రత్యేకరైలు వాల్తేరు వస్తున్నదను వార్త బాగా ప్రచారమయినది. కనుక దూరప్రదేశాలనుండిగూడ చాలమంది ప్రజలు గాంధి మహాత్ముని దర్శించి వారి సందేశము వినుటకు క్రిందటి రాత్రియే విశాఖపట్టణము చేరిరి. వాల్తేరులో గొప్ప బహిరంగ సభ జరిగినది. సభావేదికపై మహాత్మ గాంధీజీ రావటంతోనే మహాత్మ గాంధీకీ జై - అను నినాదం మిన్నుముట్టెను. ప్రజలు ఆనందోత్సాహములతో గాంధీమహాత్ముని సమీపమునుండి దర్శనము చేసికొనుటకు ముందుకు త్రోసుకొని రాజొచ్చిరి. అందువల్ల సభలో గందరగోళం సాగెను. శాంతముగా కూర్చొనవలెనని మహాత్ముడు ప్రజలను కోరిరి. ఇంకను సభలో కల్లోలము తగ్గలేదు. అప్పుడు గాంధీజీ గంభీరముగా యిట్లనిరి :

“క్రమశిక్షణ అవసరం. లక్షలకొలది జనంవచ్చినా మనం ప్రశాంతంగా సభలను జరుపుకొనలేకపోతే మనం స్వరాజ్యం పొందటానికి అర్హులం కాజాలము. ఒకవేళ స్వరాజ్యమువచ్చినా మనం క్రమశిక్షణతో మెలగడం నేర్చుకొన

నిచో ఆ స్వరాజ్యాన్ని నిలుపుకోలేమని హెచ్చరించేటప్ప టికి సభయావత్తూ నిశ్శబ్దమూవహించెను. అప్పుడు ప్రజలను అభినందించిరి. ఈ పర్యటనలో గాంధీజీ హిందీలోనే ఉపన్య సించిరి. వారి ఉపన్యాసమును తెలుగులోకి అనువదించు మహద్భాగ్యము నాకు కలిగినందుకు నేనెంతయు సంతోషిం చుచున్నాను. ఈ యాత్రలో నేను వాల్తేరునుండి మద్రాసు వరకును మరల బెజవాడనుండి కాజీపేటవరకును ఉండుటకు అవకాశము కలిగినందులకు నా జీవితము ధన్యమైనదని భావిం చుచున్నాను. ఏలనన వారి సాంగత్యమువలనను, వారి సాన్ని ధ్యమువలనను నాకు కలిగిన అనుభూతి అనుపమానము, మరపురాని ఆ ప్రయాణములోని దివ్యస్మృతులు తలచు కొన్నప్పుడు నా హృదయము ఆనందముతో నిండిపోవును. నిత్యజీవితములో వారి బోధనలను, వారి ఆచరణను అనుస రించి భవబంధమునుండి ముక్తిపొందుటకు నా ఆత్మ తహ తహలాడుచుండును. ఈ జీవుని గమ్యస్థానమేదో తెలుసు కొనుటకు గాంధీజీ బోధలే నాకు సహకారియయినవని చెప్పు టలో సందేహ మిసుమంతయు లేదు. గాంధీజీ నిత్యజీవితవిధా నమే భవబంధవిముక్తికి రాజమార్గము. ఆ మార్గమున ఏ కొలదిదూరము ప్రయాణముచేసినను జీవితము ధన్యత చెందును. పునర్జన్మయందు విశ్వాసముగలవారికి ఈ జన్మలో ఏమాత్రము ఆత్మోన్నతికి కృషిచేసినను అది ఉత్తరజన్మకు కూడబెట్టుకున్న పెన్నిధియే కాగలదు. గాంధీజీ శుష్క వేదాంతికారు. మనము చిన్న విషయములని భావించెడి వానియందును అతిశ్రద్ధ తీసుకొనును. వారిదృష్టిలో ఒక

క్షణకాలము, ఒకపైసా గూడా అతివిలువైనవి. ఒక నీటి బిందువును గూడ వృథాచేయుట వారు సహింపరు. ప్రతి పనియు సమయానికి సక్రమంగా జరుగవలసినదే. ఏకొంచెము లోపము జరిగినా, సహచరులు అశ్రద్ధచేసినా వారు మందలించెడివారు. క్రమశిక్షణ అతిప్రధానమయినది. క్రమశిక్షణకు లోబడి జీవితము గడుపువారే ఆత్మోన్నతిని సాధించగలరు. ప్రతిచిన్నపనియు ఆత్మోన్నతికి దోహదమివ్వగలదు.

వాల్తేరులో ప్రప్రథమముగా గొప్ప బహిరంగసభ జరిగినది. గాంధీజీ హిందీలో ప్రసంగించారు. ఆ ప్రసంగమును నేను తెలుగులోని కనువదించుటకు మైకువద్ద నిలుచున్నాను. అంతగొప్ప సభలో మైకుముందు నిలుచుండి మాట్లాడుట నా కదియే మొదలు. నేను మైకుకు చాల సమీపంగా ఉండటంచూచి వెంటనే బాపూజీ యిలా అన్నారు :

"మైకుకు కొంచెము దూరంగా ఉండాలి. అప్పుడు గాని మనము మాట్లాడేది అందరికీ స్పష్టంగా వినిపించదు. మైకులో బిగ్గరగా ఆయాసంవచ్చేటట్లు మాట్లాడ నవసరం లేదు. ఇదియే మైకుయొక్క ప్రయోజనం." ఇటువంటి చిన్న విషయాలు గూడ వారు గమనించి అనుయాయులకు సలహా యిస్తూఉండేవారు. ఎవరైనా మైకుకు దగ్గరగానుండి మాట్లాడుతుంటే నాకు గాంధీజీ చెప్పినమాట జ్ఞాపకం వస్తుంటుంది.

వాల్తేరులో గాంధీమహాత్ముని ఉపన్యాసము

"ఇప్పుడు మీ దగ్గరకు డబ్బు వసూలుచేయటానికి నేను రాలేదు. ఇస్తే అక్కరలేదనను. (నవ్వు) మీరంతా

ఎంత శ్రమశిక్షణ అలవరచుకున్నారో, ఎంత అభివృద్ధి చెందారో పరిశీలించి గ్రహించటానికి వచ్చాను. దక్షిణ దేశమునకు నేను యిప్పుడు ఎందుకువచ్చానో ఆ ప్రధాన కార్యం మీ అందరికీ తెలుసును. దక్షిణభారత హిందీ ప్రచార సభ, మద్రాసులో స్థాపించి యిప్పటికి 27 సంవత్సరాలయింది. ఆ సభకు ఇప్పుడు మద్రాసులో రజత జయంతి ఉత్సవాలు జరుగుచున్నవి. ఆ సభ ఎంత అభివృద్ధి చెందిందో, హిందీ ప్రచారం దక్షిణదేశంలో ఎంతవరకు వ్యాపించిందో తెలుసుకొనుటకు గూడ వచ్చినాను.

"నేను రైలు ఆగటంతోనే ఇద్దరు ఆంధ్రబాలికలను వెంటపెట్టుకొని వారితో మాట్లాడుతూ ఇక్కడికి వచ్చాను. వాండ్లను హిందూస్తానీలో పలకరిస్తే హిందూస్తానీ నేర్చుకోలేదు, రాదన్నారు. ఈవార్త నాకు విచారాన్ని కలుగచేసింది. నాకు ముఖ్యంగా యీ విషయమై మీరు సంజాయిషీ చెప్పుకోవాలి.

"మీరందరు హిందూస్తానీ భాషనేర్చుకోవాలి. ఆంధ్ర దేశంలో హిందీ ప్రచారం బాగా జరుగుతున్నదని నాకు తెలుసును. కాని ఈ అభివృద్ధి చాలదు. అందరూ హిందూస్తానీ భాషను తెలుగు భాషతోపాటు నేర్చుకొనవలెను. ఇది మీ ముఖ్యకర్తవ్యము. ఇంగ్లీషు భాష పరాయిభాష. హిందూస్తానీ దేశభాష. ఇంగ్లీషు ఎన్నటికిని మన ప్రజా భాష కాజాలదు. కనుక స్వరాజ్యం కావాలంటే మీరందరూ హిందూస్తానీ తప్పక నేర్చుకొనవలెనని ఉద్బోధించారు.

తదుపరి అస్పృశ్యతా నివారణ, హిందూ మహమ్మదీయ సఖ్యత, శాంతి మార్గముననే, సత్య అహింసా మార్గముననే త్యాగముచేసి స్వరాజ్యాన్ని సంపాదించవలె"నని ఉపన్యసించిరి.

గాంధీజీతో వచ్చినవారిలో శ్రీమతి సుశీలానయ్యర్, మరి యిద్దరు ముగ్గురు సముద్రస్నానమునకై వెళ్ళినారు. దారిలో వారి కారు చెడిపోవుటచే వారు వచ్చేటప్పటికి కొంత ఆలస్యమయింది. మహాత్ముని పరివారం భోజన విశ్రాంతులకు సింహాచలంలో స్పెషల్ రైలు సుమారు మూడు గంటలసేపు ఆగింది. మహాత్ముని స్వాగతసన్నాహంతో అచటి పెద్దలంతా మునిగిఉండటంవల్ల మహాత్ముని స్నానాది కాలకృత్యాల ఏర్పాటును గూర్చి ఎవరూ పట్టించుకోలేదు. చివరకా మాట జ్ఞప్తికివచ్చి ఆ ఏర్పాట్లు చేసేసరికి చాల ఆలస్యమయింది. గాంధీజీ ఆ అవ్యవస్థకు చికాకుపడి అచటి పెద్దలను మందలించారు. ఇదియు క్రమశిక్షణకు భంగకరమగు విషయమే గదా. ఎన్ని పనులున్నను అన్నిపనులు సమయానికి నెరవేరునట్లు ఏర్పాటు చేయుటలోనే నేర్పరితనముగలదు. అదియే క్రమశిక్షణతో గూడిన సువ్యవస్థ కాగలదు. ఆ సమయముననే అక్కడికొక మిలిటరీ రైలువచ్చి ఆగింది. దానిలోని సైనికులందరు దిగివచ్చి మహాత్ముని దర్శనం చేసికొన్నారు. ఆ యాత్రలో కనిపించిన ప్రతివారిని అడిగినట్లే సైనికులను గూడ హరిజననిధికి ఆయన విరాళము లివ్వవలసినదిగా కోరినారు. కాని వాండ్లు

ఒకరిముఖం ఒకరు చూచుకొని ఊరుకున్నారు. అప్పుడు సైనికుల నుద్దేశించి ఆయన ఇట్లన్నారు:

"మీరేనా దేశమును రక్షించేది? ప్రజలను రక్షించేది? బీదవారికి ఒకపైసా గూడా సహాయంచేయ ధైర్యం లేని మీరు దేశమును ఏమి రక్షించెదరు? మీరు యింత పిరికివారనుకొనలేదు. హరిజననిధికి విరాళమివ్వమని నేను గవర్నరును, వైస్రాయిని గూడా అర్థించెదను. ఇది రాజ ద్రోహమేమీకాదు!" అని వారికి ఈమాదిరిగా ధర్మప్రబోధమును, ధైర్యమును కలిగించేసరికి సైనికులు వారికున్నంత వరకు విరాళము లొసగిరి. మహాత్ముని వాక్కు అమృత వాక్కు, సైనికులయందు ధర్మప్రబోధముగావించి వారిని వశీకరణ చేసుకొనే అద్భుతశక్తి ఆయనది.

సహచరులయెడ ఆదరణ

శ్రీ దిగుమర్తి రామస్వామిగారు, వారి అన్నగారు శ్రీ దిగుమర్తి హనుమంతరావుగారు, వారి కుటుంబము మహాత్మ గాంధిగారి అనుచరులు. సత్యాగ్రహ సమరములో వారందరు త్యాగముచేసి కారాగారశిక్షల ననుభవించిరి. శ్రీ హనుమంతరావుగారు గాంధీమహాత్ముని సబర్మతీ సత్యాగ్రహ ఆశ్రమములో కొంతకాలముండి మహాత్ముని మన్ననలకు పాత్రులై తదుపరి నెల్లూరుజిల్లాలో పల్లెపాడు గ్రామము వద్ద సత్యాగ్రహ ఆశ్రమము స్థాపించి ఖాదీ, హిందీ ప్రచారము మొదలగు నిర్మాణ కార్యక్రమమును సాగించెడివారు. శ్రీ దిగుమర్తి రామస్వామిగారు గుంటూరుకోర్టులో శిరస్తాదారుగా పనిచేయుచు 1921 లో ఆ పదవికి రాజీనామా

యిచ్చి సత్యాగ్రహ సమరములో పాల్గొనిరి. తదుపరి కొంత కాలము ఆంధ్ర జాతీయ కళాశాల మచిలీపట్నంలో - ప్రిన్సి పాలుగా పనిచేసిరి. శ్రీ రామస్వామిగారు స్పెషల్ రైలులో మహాత్ముని కలుసుకొనిరి. గాంధీజీ రామస్వామిగారి కుటుంబ యోగక్షేమములు, వారి తల్లి ఆరోగ్యమును గురించి కుశల ప్రశ్న లడిగిరి. రామస్వామిగారి తల్లి వృద్ధాప్యమువల్ల లేవ లేని స్థితిలో ఉన్నారని తెలుసుకొని గాంధీజీ చాల విచారించిరి. అలా జీవించటం దుర్భరమనిరి. అప్పుడు రామస్వామి గారు మీరు 125 సంవత్సరాలు జీవించెదరని తెలుసుకొని మా తల్లిగారు చాల సంతోషించినదన్నారు. అందుకు బాపూజీ యిట్లనిరి :

"నేను 125 సంవత్సరాలు జీవిస్తానని చెప్పలేదు. మరుక్షణము ఏమవునో ఎవరికి తెలియును? భగవంతుడు యీ సేవకుని సేవ అవసరమని సంకల్పిస్తే మానవసేవ చేసేందుకగాను నేను 125 సంవత్సరములు జీవింపగోరుచున్నానే గాని జరాభారముతో క్రుంగి కృశించి లేవలేనిస్థితిలో ఉండి 125 సంవత్సరాలు బ్రతకాలని నా ఉద్దేశం కాదు." వారన్నట్లే వెళ్ళిపోయారు మహాత్ముడు, ఆఖరుక్షణంవరకు మానవసేవలో నిమగ్నులై.

శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారు హిందీ ప్రచారసంఘ అధ్యక్షులు. నేను అపుడు ఆ సంఘమునకు కార్యదర్శిగానుంటిని. వెంకటప్పయ్యపంతులుగారి కాలికి దెబ్బతగులుటచే లేచి సరిగా నడవలేని స్థితిలో ఉండిరి. మహాత్ముని దర్శించుటకు రాలేనిస్థితిలో ఉన్నామని బాపూ

జీకో మనవి చేయవలసినదిగా నాతో వారు చెప్పిరి. సింహాచలంవద్ద రైలు ఆగినపుడు బాపూజీతో ఈ విషయం మనవి చేసితిని. అందుకు బాపూజీ యిట్లనిరి : "ఎంతమాట. వెంకటప్పయ్యపంతులుగారు వయోవృద్ధులు. నాకంటె పెద్దవారు. వారివద్దకే నేను వెళ్ళి వారిని దర్శించ అభిలషించుచున్నాను. కాని యిప్పుడు నాకు అట్టి అవకాశము లేనందుకు విచారించుచున్నాను. దేశభక్తుడు గాంధీజీకి అనన్యభక్తుడు. గాంధీజీ ఆంధ్రదేశమునకు వచ్చినపుడు వారిని దర్శించకుండ యెట్లుండగలరు ? లేవలేనిస్థితిలో ఉండిగూడ యితరుల సహాయముతో విజయవాడ స్టేషనుకువచ్చి సోమవారం ఉదయమున మహాత్ముని రైలులో కలుసుకొనిరి. గాంధీజీ ఆదివారం సాయంత్రము ఐదుగంటల నుండియే 24 గంటల మౌన వ్రతం ప్రారంభించిరి. కనుక శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారిని ఎంతో ప్రేమతో మౌనంగానే ఆహ్వానించిరి. మౌనవ్రతమగుటచే ఒకకాగితంమీద గాంధీజీ యిట్లు వ్రాసి వారికిచ్చిరి: 'మనము కలిసి చాలకాలం పనిచేసితిమి. మీరు వయోవృద్ధులయితిరి. ఆరోగ్యము సరిగాలేదు. మీరు యింత శ్రమపడి ఎందుకు వచ్చినారు ? మీ ఆరోగ్యమును జాగ్రత్తగా కాపాడుకొనండి.' వెంకటప్పయ్యపంతులుగారు గాంధీజీ వెంట విజయవాడనుండి చీరాల స్టేషనువరకు పయనించిరి. మార్గమధ్యమున వెంకటప్పయ్యపంతులుగారు గాంధీజీని అనేక ఆధ్యాత్మికవిషయమైన ధర్మసందేహములు అడిగి తెలుసుకొనిరి. ఆ సందేహము లన్నిటికి ప్రత్యుత్తరములు

సూత్రప్రాయంగా ఒక కాగితంమీద వ్రాసియిచ్చిరి. వా రడిగిన ప్రశ్నలలో కొన్ని -

భగవంతుని మనమెందుకు ప్రార్థించవలెను ? ప్రార్థించిన మన కోర్కెలు నెరవేర్చునా ? ప్రార్థించకున్న మనక్షేమములు భగవంతుడు చూడడా ? కర్మఫలితం ఎంతవరకు ? పురుషప్రయత్నం ఎంతవరకు ? భగవదేచ్ఛ ఎంతవరకు ? మొదలగు ప్రశ్న లడిగిరి.

గాంధీజీ యిచ్చిన జవాబు

భగవంతుని ప్రార్థించక గత్యంతరము లేదు. మన కోర్కెలన్నిటిని భగవంతుడు తీర్చకపోవచ్చును. చివరకు మనము దేనికి అర్హులమో దానినే అతడు ప్రసాదించును. మనము మనోవాక్కాయకర్మలను భగవంతుని అధీనం చేసి, మనము భగవంతుని చేతిలో కీలుబొమ్మలమను విషయములో అచంచల విశ్వాసమున్నచో, మనము చేయు కర్మలన్నియు పాపపుణ్యములకు అతీతమగును. మనము కర్తవ్యభారమునుండి విముక్తులమగుదుము. అప్పుడు సుస్థిర శాంతి సౌఖ్యములు పొందగలము. ఇది మహాత్ముడు చెప్పిన సారాంశము. ఈ సంభాషణ అపూర్వమైనది. పంతులుగారు రాజకీయములలో ప్రవేశించినను వారికిగల ఆధ్యాత్మిక చింతన, సాధన ఎంత మహత్తరమైనదో యీ సంభాషణవలన బోధపడగలదు. వీరి సంభాషణలలో రాజకీయములకు సంబంధించిన ప్రసక్తి ఒకటిగూడ రాలేదు. భగవద్భక్తి, పాపభీతి, ఆధ్యాత్మికచింతనవంటి సుగుణములు ఏకాలది రాజకీయ

నాయకులకున్నను నేడు మన దేశము ఎంతయో పురోభివృద్ధి గాంచెడిది.

ది 21-1-46 సోమవారం సాయంత్రము సుమారు ఐదు గంటలకు స్పెషలురైలు మద్రాసు చేరినది. ఆనాడు మౌనవ్రత మగుటచే మౌనవ్రతం ప్రారంభించుటకు ముందు తనను దర్శనం చేసుకొనుటకు వచ్చిన ప్రజలకు వినిపించుటకై గాంధీజీ సందేశమును వ్రాసి శ్రీ కళా వెంకట్రావు గారికి యిచ్చిరి. వారు రైలు ఆగిన స్టేషనులో ఈ సందేశమును చదివి వినిపించిరి.

సందేశము

"ఆంధ్రదేశములో ఈ పర్యాయము ఒకటి రెండు రోజులైన పర్యటన చేయజాలనందుకు నేను విచారించుచున్నాను. ఈ సంచారము నాకు ఆనందదాయకమైనా నా అశక్తతను నా వృద్ధాప్యమును చూచి మన్నింప గోరుతున్నాను. నన్ను చూడడానికి వచ్చేబదులు మీరంతా నిర్మాణకార్యక్రమానికి మీ యావచ్ఛక్తిని, కాలాన్ని వినియోగించండి.

ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులుగారు అనకాపల్లి స్టేషనులోనే మహాత్మ గాంధిగారిని దర్శించి మాట్లాడినారు. వారుభయులు ఆంధ్రదేశ రాజకీయాలను గురించి, నిర్మాణకార్యక్రమమునుగురించి మాట్లాడినారు. ఈ సంచారములో మహాత్మ గాంధిగారు హిందూస్తానీలో ఉపన్యసించవలయుననే నియమమునే గాక సాధ్యమైనంతవరకు

హిందూస్తానీలోనే నాయకులతో మాట్లాడవలయునను నిబంధన గూడ ఏర్పరచుకొన్నారు. ఆ ప్రకారమే శ్రీ ప్రకాశం పంతులుగారితో హిందూస్తానీలోనే మాట్లాడిరి. ప్రకాశం పంతులుగారు హిందూస్తానీలోనే ప్రత్యుత్తర మొసగిరి. ఈ సంభాషణలో ఏర్పాట్లలో జరిగిన అవ్యవస్థనుగూడ ప్రకాశం పంతులుగారికి గాంధీజీ తెలియజేసిరి.

అనకాపల్లిలో కాంగ్రెసు సంఘుంతరపున శ్రీ గ్రంధి కన్నయ్య పంతులుగారు రు 1000 లు గాంధీజీకి సమర్పించిరి. శ్రీయుతులు కోరుకొండ బుచ్చిరాజు, గడ్డం సన్యాసయ్య, గస్తుల వీరవెంకటసత్యనారాయణ, మున్నగు స్థానిక నాయకులు గాంధీజీని సన్మానించిరి.

గాంధీజీ దర్శనంతో ప్రజలు పొందిన పరవశత్వం

వాల్తేరునుండి మద్రాసుచేరేలోపల స్పెషలు రైలు ఆగిన ప్రతిచోటా వేలకువేలు జనంవచ్చి గాంధీజీని సందర్శించారు. నెల్లూరు సమీపంలో స్టేషనుకుముందు రైలు కొంతసేపు ఆగింది. జెండాలు తోరణాలతో అలంకరింపబడిన బండి గాంధీజీ స్పెషలు రైలు అని ప్రజలకు తెలుసుగదా? అక్కడ సమీపంలో పొలాలలో పనిచేస్తున్న రైతులు, కూలీలు ఎక్కడి పనులు అక్కడ వదలివేసి పరుగెత్తుకొని వచ్చి మహాత్ముని దర్శించి తమ జన్మ ధన్యతగాంచినట్లుగా భావించి తన్మయత్వము పొందిన ఆ దృశ్యములు మరపురానివి. మహాత్ముని చూడగానే ఆ అమాయకుల ముఖాలలో కలిగిన ఆనందానుభూతి, మనోవికాసమూ అద్వితీయ

మైనవి. ఆ మొక్కటమూ, ఆ చెంపలు వేసుకోటమూ, ఆ సాష్టాంగపడటమూ చూస్తే యిది మూఢభక్తియా అని పించును. పుణ్యతీర్థాలు సేవించినప్పుడుగాని, భగవత్కళ్యాణ మహోత్సవాలకు వెళ్ళినపుడుగాని, యతులను, యోగులను దర్శించినపుడుగాని ప్రజలు ఇంతటి తన్మయత్వం పొందటం నే నెప్పుడూ చూడలేదు. గాంధీజీ భక్తులమని చెప్పుకుంటూ అనవరతం వారిసాన్నిధ్యంలోనే ఉండే వాండ్లలో ఎందరో అమాయక ప్రజలుపొందిన పరవశత్వాన్ని పొందియుంటారు ? అని నా సందేహం. ఈ జనసామాన్యపు భక్తి మూఢ భక్తియేకావచ్చు. అయినా మహాత్ముని దర్శనభాగ్యంచేతనే ఒక క్షణకాలమే కానింకు, వారుపొందిన ఆనందం, తన్మ యత్వం, ఆత్మపురోభివృద్ధి మార్గంలో వారినొకమెట్టు యెక్కించినదనే నా విశ్వాసము.

మద్రాసుకు చేరుట

21-1-46 సోమవారం సాయంత్రం 4 గంటలకు స్పెషలు రైలు మద్రాసు పరిసరాలకు చేరినది. సెంట్రల్ స్టేషనుకు వెళ్ళినచో అక్కడ గుమిగూడిన వేలాది జనంనుండి తప్పించుకొనిపోవడం కష్టసాధ్యమని తలంచి రైల్వే అధికా రులు రైలును మద్రాసుకు 29 మైళ్ళ దూరములో బొంబాయి మార్గముననున్న అంబత్తూరు స్టేషనుకు మర ల్చిరి. కలకత్తా మార్గంనుండివస్తున్న స్పెషలు రైలును ఈవిధంగా మారుస్తారని ఎవరూ ఊహించలేదు. సెంట్రల్ స్టేషనువద్ద గుమికూడిన జనానికి చాల ఆశాభంగం కలిగింది. అంబత్తూరు స్టేషనుకు సరిగా 4.15 గంటలకు రైలు చేరింది.

అక్కడ దక్షిణభారత హిందీ ప్రచారసభ ఉపాధ్యక్షులు శ్రీ సి. రాజగోపాలాచార్యులు, ప్రధాన కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణ, రజతజయంతి కమిటీ అధ్యక్షులు సర్. యన్. గోపాలస్వామి అయ్యంగారు, డాక్టరు పి. సుబ్బరాయన్, కామరాజునాడార్, శివలెంక శంభుప్రసాద్, యన్. అన్నాదురై, బి. యస్. మూర్తిగార్లు స్వాగతం ఇచ్చారు. తరువాత గాంధీజీ, సత్యనారాయణగారు, రాజగోపాలాచారిగారు కారులో సభాభవనమునకు త్యాగరాయనగరుకు వెళ్ళినారు. క్రిందటి దినం సాయంత్రం 4.15 గంటలకు అనకాపల్లిలో ప్రారంభింపబడిన మౌన వ్రతము గాంధీజీ అంబత్తూరు స్టేషనుకు రాగానే సాయంత్రం 4.15 గంటలకు విరమించారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభవద్ద గాంధీగారి దర్శనార్థమై సుమారు లక్షమంది జనం పోగై ఉన్నారు. గాంధీజీ దూరప్రయాణంచేసి వచ్చారనియు ఇప్పుడు బడలికగా ఉన్నారనియు ప్రజలను వెళ్ళిపోవలసినదిగా విజ్ఞప్తిచేశారు. కాని ప్రజలు కదలలేదు. గాంధిమహాత్ముని దర్శనము చేసుకొనిగాని వెళ్ళమని పట్టుపట్టారు. అప్పుడు గాంధీజీ బయటకువచ్చి వారికి దర్శనమివ్వక తప్పినదికాదు. ప్రజలనుద్దేశించి గాంధీజీ యిట్లనిరి :

"నేను చాల దూరప్రయాణంచేసి వచ్చాను. స్నానం చేయలేదు. బడలికగా ఉన్నది. ఆహారం పుచ్చుకోలేదు. నేను చేయవలసిన పని ఎంతో పేరుకొని ఉన్నది. ఈరాత్రి అంతా ఈవిధంగా మీ మధ్య ఇలా నిలబడి ఉండాలనేనా మీ కోరిక ? ఇది విని ప్రజలంతా ఒక్కమారు 'కాదు,

కాదు. మిమ్ములను మేము ఆ విధంగా నిర్బంధించము' అన్నారు.

అంతట గాంధీజీ ఆ జనసమూహాన్ని యింట్లకు పొమ్మనిచెప్పి తాను వారినుండి సెలవుపుచ్చుకొని తన బసకు వెళ్ళిరి.

# 21

## మద్రాసులో జరిగిన వివిధ సభలు, సమావేశాలు

మహాత్మగాంధి హిందీ ప్రచార సభ రజతజయంతి ఉత్సవములను పురస్కరించుకొని మద్రాసులో 21-1-46 తేదీనుండి 1 ఫిబ్రవరి తేదీవరకు-12 రోజులు ఉన్నారు. ఈ పన్నెండు రోజులలో హిందీప్రచారసభకు సంబంధించిన ప్రచారకుల సమ్మేళనము, హిందీపట్టప్రదానమహోత్సవములే కాక వివిధ సభలు, సమావేశములు జరిగినవి.

24వ తేదీన మహాత్మగాంధిగారి అధ్యక్షతన నిర్మాణ కార్యకర్తల సమ్మేళనము జరిగినది. శ్రీ కృష్ణదాస్ బజాజ్ గారు సభను ప్రారంభించిరి. నూలువడుకుటలో పోటీలు జరిగినవి. ఈ సమావేశములలో శ్రీ సి. రాజగోపాలాచార్యులు, శ్రీ జె. సి. కుమారప్ప, శ్రీ కాకా కాలేల్కార్ గార్లు పాల్గొనిరి. 26 వ తేదీన మహాత్మగాంధిగారి అధ్యక్షతన హరిజన సమ్మేళనము జరిగినది.

27వ తేదీన గాంధిగారి అధ్యక్షతన హిందీ పట్టప్రదాన మహోత్సవము జరిగినది. గాంధీజీ తమ చేతులతో హిందీ ప్రమాణపత్రములు విద్యార్థులు, విద్యార్థినులకు యిచ్చిరి.

శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ పట్టభద్రులకు హితోప దేశము చేసిరి.

సాహిత్య కళాకారుల సమ్మేళనము, విద్యార్థుల సమావేశములు, కాంగ్రెసు కార్యకర్తల గోష్ఠి, మహిళా సభ, కార్యకర్తలసభ, హరిజనసభ మొదలగు సభలు జరిగినవి. ఆయా సభాసమావేశాలలో మహాత్మగాంధి ఉపన్యసించిరి.

**సాహిత్యకళాకారుల సమ్మేళనము**

ఈ సమ్మేళనము 30-1-46 న సభాభవనములో కన్నడ సాహిత్యకారులు శ్రీ మాస్తి వెంకటేశయ్యర్‌గారి అధ్యక్షతన జరిగినది. దక్షిణదేశములోని ఆంధ్ర, కర్నాటక, తమిళ ప్రాంతములలోని ప్రసిద్ధ కళాకారులు, సాహిత్యపరులు యిందు పాల్గొనిరి. మైసూరు మహారాజా కాలేజి ప్రొఫెసర్ శ్రీ బి. సీతారామయ్య, తమిళ ప్రసిద్ధ కథకులు శ్రీ వి. రామస్వామి, ఆంధ్ర ప్రసిద్ధ కవులు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు, మళయాళ 'మాతృభూమి' పత్రికా సంపాదకులు శ్రీ దామోదరమీననుగార్లు యీ సభలో తమ తమ ప్రాంతములలోని సాహిత్య ప్రగతిని గూర్చి ఉపన్యసించిరి.

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతన కళాకారుల సమావేశము జరిగినది. ఇందు శ్రీయుతులు చానుకూరి, రాజగోపాలన్, యం. ఆర్. రామచంద్రరావు, బుచ్చి కృష్ణమ్మ మొదలగువారు పాల్గొని ఉపన్యసించిరి.

చామకూరి శ్రీ గాంధిగారి చిత్రమును వ్రాసి గాంధిగారికి బహూకరించగా వారు దానిని అక్కడనే వేలం వేసి రు. 350 లు సంపాదించిరి.

మహాత్ముని సందేశము

"సాహిత్యము, కళలు మానవుని ఆత్మోన్నతికి సాధనములుగా ఉండవలయును. సాహిత్యము, కళలు మానవుని సృష్టి. కనుక అవి మానవుని అభ్యుదయమునకు ఉపయోగపడవలెను. కళ మనకొరకు, మనము కళకొరకు కాదు. నేటి సాహిత్యకారులు, కళాకారులు తమరచనలను, తమకళలను స్వాతంత్ర్యసముపార్జమునకు బలిష్ఠ సాధనములుగా రూపొందించవలయునని నేనాశించుచున్నాను."

26-1-46 న మహిళా సమ్మేళనము జరిగినది. విజయనగరం మహారాణి శ్రీమతి విద్యావతిదేవి మహాత్మాగాంధిగారికి స్త్రీలపక్షమున పదివేల రూపాయలు సమర్పించి "సమయం లేనందున ఎక్కువ వసూలుచేయలేకపోతిమి. మూడు మాసములలో ఒక లక్షరూపాయల నిధి వసూలు చేయగల"మని గాంధీజీకి విన్నవించిరి. గాంధీజీ పదివేల రూపాయలు సమర్పించినందులకు ధన్యవాదము లొసగుచు "మూడు మాసములలో ఒకలక్ష రూపాయలు వసూలుచేసి యిస్తామన్నారు. జ్ఞాపకముంచుకోండి. ఈ జనమంతా యిందుకు సాక్ష్యము" అన్నారు. "కాని డబ్బువసూలు చేయుటకు సమయము తగినంత లేకపోయినను, మహారాణి గారు ఒక్కరే ఒకలక్ష రూపాయలు ఇవ్వగలరు. కాని వారు ఒక్కరే ఇస్తే నాకు తృప్తి, సంతోషములేదు. దక్షిణ దేశములోని నాలుగు ప్రాంతముల స్త్రీలు సహాయంచేసి వారికి తోడ్పడి లక్ష రూపాయలు వసూలు చేయవలయునని నేను కోరుచున్నాను. నేను ఈ డబ్బులో కొంతభాగము

స్త్రీ ల లో హిందీ ప్రచారానికి, కొంత హరిజనోద్ధరణకు వినియోగించెద" నని గాంధీజీ చెప్పిరి.

"స్త్రీలు ఎక్కువగా విలువైనవస్త్రములు, నగలు ధరించెదరు. డబ్బు వాటికి ఖర్చుచేయుటకు బదులు నిరాడంబరమైన ఖాదీవస్త్రములు ధరించవలెనని నేను కోరుదును. అన్నిటికంటె ప్రధానమైనది – సత్ప్రవర్తన, పవిత్రత. అజ్ఞానమువలన ఆభరణములు ధరించుటయందు వ్యామోహము కలిగియున్నాము. సీత నిరాడంబరము, పవిత్రత ఆదర్శముగానుంచుకొనవలెను. సీత పాతివ్రత్యధర్మము మహోజ్వలమయినది. అందుకనే రావణుడు ఆమెను స్పృశింపజాలకపోయెను. భారత దేశంలో అట్టి ఉదాహరణ లెన్నో కలవు. భారతదేశపు పవిత్రత, తేజస్సు స్త్రీలమీదనే ఆధారపడియున్నవి. దుశ్శాసనుడు ద్రౌపది మానభంగము చేయతలపెట్టినప్పుడు పాండవులు ఆమెను కాపాడజాలక పోయిరి. కాని ఆమె తన పవిత్ర నైతిక బలముచే భగవంతుని సహాయ మర్థించగా భగవంతుడామెను కాపాడెను. స్వరాజ్యమును, రామరాజ్యమును, స్థాపించుట స్వల్పవిషయములు. భారతదేశ నారీమణులు ఆ పవిత్రత, ఆ తేజస్సును సంపాదించినచో పరప్రభుత్వము యిక్కడ నిలువజాలదు. కనుక సోదరీమణులకు నేను విన్నవించునదేమనగా మీకు నిజమైన ఆభరణములు సంపద, పవిత్రత, తేజస్సు. అంతేగాని నగలు, విలువైన వస్త్రములుకావు.

"హరిజనుల విషయమై గూడ మీకు చెప్పదలచినాను. మీరు హరిజనులుతాకిన నీరు త్రాగరు. ఈ ఆచారమును

మార్చుకొనవలయును. హిందువులు, మహమ్మదీయులు, పారసీకులు, క్రైస్తవులు అను భేదభావమును వదలవలయును. ఐకమత్యము కొరకు స్త్రీలు పాటుపడవలయును. ఈ ఐకమత్యము జాతీయభాషయగు హిందూస్తానీ వలన కలుగునని ఆశించుచున్నాను. మీరందరు హిందూస్తానీ నేర్చుకొనండి."

విద్యార్థి సమ్మేళనములో గాంధీజీ విద్యార్థుల కొసగిన హితవు

"విద్యార్థులు చేయవలసిన పనులు చాలా ఉన్నవి. ఉదాహరణకు నిరక్షరాస్యతను తొలగించుటకు మీరు పాటుపడవచ్చును. కాని విద్యార్థులు రాజకీయాలలో ప్రవేశించ గూడదు. వారు విద్యనభ్యసించుచు రాజకీయములలో పని చేయజాలరు. కనుక విద్యార్థులు రాజకీయములలో పని చేయదలచుకొన్నచో వారు కాలేజీ చదువులకు స్వస్తిచెప్పి రాజకీయరంగములో ప్రవేశించి పని చేయవచ్చును."

కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో గాంధీజీ చేసిన ప్రబోధము

"మీరందరు నేటివరకు హిందూస్తానీ నేర్చుకొనలేదు. ఇది మంచిపనికాదు. విదేశీభాషనుండి విముక్తి పొందుట ప్రతి భారతీయుని ధర్మము. ఇంగ్లీషుభాష నేర్చుకొనుటలో చేయవలసిన కృషిలో ఒక అణావంతు కృషిచేసిన హిందూస్తానీ నేర్చుకొనగలరు. ప్రాంతస్థాయిలో వ్యవహారాలకు ప్రాంతీయభాష, మాతృభాష ఉపయోగింపవచ్చును. కాని అంతర్ప్రాంతీయ వ్యవహారాలకు జాతీయభాష హిందూస్తానీ నేర్చుకొనుట చాల అవసరము. ప్రతి కార్యకర్త తన హృదయాంతరాళంలో ఉన్న ఈశ్వరుని తెలుసుకొని ఆతని

ఆదేశానుసారము నడుచుకొనవలయునని నేను కోరు చున్నాను.''

నిర్మాణకార్యకర్తల సభలో గాంధీజీ యిచ్చిన ఉపన్యాస సారాంశము

''మీరందరు హిందూస్తానీ నేర్చుకొనవలెను. నాకు ఇంగ్లీషులో మాట్లాడేకాలము గడచిపోయినది. ఇకమీదట నేను హిందూస్తానీలోనే మాట్లాడుటకునిశ్చయించుకొన్నాను. విదేశీయులతో మాత్రమే ఇంగ్లీషులో మాట్లాడెదను. ఇంగ్లీషులో నా అభిప్రాయములు బాగా వ్యక్తపరచే శక్తి నాకు ఉన్నను, వచ్చీ రాని హిందీలోనే నేను మీ యెదుట ఉపన్యసించ దలచాను.

నాకు సమయమున్నచో నేను పాయిఖానాలనుండి పాఠశాలలవరకు అన్నియు శుభ్రముగా ఉన్నదీ లేనిదీ పరీక్షింపగోరుచున్నాను. నిర్మాణకార్యక్రమములోని పదునెనిమిది అంశాలలో యివన్నీ ఉన్నవి.

నేడు దేశముముందు నిర్మాణకార్యక్రమము, పార్లమెంటరీ కార్యక్రమము రెండూ ఉన్నవి. ఇందులో ఒకటి తక్కువది, మరొకటి యెక్కువ ప్రాముఖ్యము కలది కాదు. కాని హిందూదేశము సత్య, అహింసామార్గముననే స్వరాజ్యము సంపాదింపగోరినచో నిర్మాణకార్యక్రమము అతి ముఖ్యమైనది. దీనిని అభివృద్ధిపరచుటయే శాసనసభలకు వెళ్లువారల ప్రధానలక్ష్యమై ఉండవలెను. కాని అట్లుకాక కేవలము దేశముయొక్క ప్రాతినిధ్యహోదాను సంపాదించుటకు

మాత్రమే వెళ్ళగోరు స్వాతంత్ర్యప్రియులు శాసనసభలకు దూరంగా ఉండి నిర్మాణకార్యక్రమము కొనసాగించుటయే మేలు.

నేను లండనునుండివచ్చిన పార్లమెంటరీ డెలిగేషనును కలుసుకొన్నాను. కాని స్వరాజ్యము వారు యిచ్చే దానము కాదని నాకు తెలుసు. స్వరాజ్యము మన శక్తిచే సంపాదించవలెను. ఇతర విధాలవలన మనకు సహాయం లభించవచ్చును. దానిని మనము స్వీకరింతుము కాని, స్వరాజ్యము ఎవరో యిచ్చే బహుమతివంటిదికాదని మనము బాగుగా గ్రహించవలయును.

దక్షిణభారత హిందీప్రచారసభ, మద్రాసు రజత జయంతి మహోత్సవసభలోను హిందీ పట్టప్రదాన మహోత్సవ సభలోను హిందీప్రచారక సమ్మేళనములోను మహాత్మ గాంధీజీ యిచ్చిన ఉపన్యాసముల సారాంశము :

"హిందుస్తానీ భాషను దేవనాగరి - ఉర్దూ రెండు లిపులలోను నేర్చుకొనవలెను. మనము ఆంగ్లభాష వ్యామోహమును వదలవలయును. మాతృభాషలోగాని హిందుస్తానీలోగాని ఎక్కువ ఆంగ్లపదములను ఉపయోగించి మాట్లాడుట మంచిదికాదు. అట్లు మాట్లాడుట ఈ ఆంగ్లభాషా దాస్యభావమును సూచిస్తున్నది. కనుక మనము దాస్యభావమునుండి విముక్తి పొందవలెను. హిందుస్తానీ హిందూదేశ భాష. కనుక ఈ భాషను అన్నిప్రాంతముల వారు నేర్చుకొనవలెను. దీని అర్థము ఆంధ్ర, కర్ణాటక,

మళయాళీ, తమిళ భాషలకు స్థానము లేదనికాదు. మీ మీ ప్రాంతములలో మీ మీ మాతృభాషలకే ప్రథమస్థానము. కాని మనము ఒకప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు వెళ్ళినపుడు అందరకు తెలిసిన భాష, అందరకు తెలియక పోయినను బహుసంఖ్యాకులకు తెలిసిన ఒకభాష సామాన్య భాషగా ఉండవలెను. ఆ భాష హిందీ – హిందుస్తానీ కనుక మీరందరు హిందుస్తానీ నేర్చుకొనవలెనని నేను కోరు చున్నాను. దేశవాసులందరు హిందుస్తానీ నేర్చుకొని ఆ భాషలో పరస్పరం మాట్లాడుట, ఉత్తర ప్రత్యుత్తరములు చేయసాగినచో హిందుస్తానీ భాషా వాతావరణం ఏర్పడును. జనసామాన్యమునకుగూడ ఆ భాషను తేలికగా గ్రహించుట కును, మాట్లాడుటకును వీలగును.

ఈ 27 సంవత్సరాలలో దక్షిణ దేశంలో హిందీప్రచారం బాగానే జరిగింది. కాని ఈ అభివృద్ధి సముద్రములో నీటిబిందువుగా నేను భావించుచున్నాను. ఇంకను ఎంతో బాగా ప్రచారము జరుగవలసియున్నది. హిందీ నేర్చుకొని మీరు హిందీలో మాట్లాడుటకు అభ్యసించండి. నేడు మన భారతీయులుచాలమంది ఇండ్లలోను తమ భార్యాబిడ్డలతోను ఇంగ్లీషుతో మాట్లాడుచున్నారు. ఇది నాకు విచారము కలిగించును. ఆంగ్లభాషలో మన భారతీయ సభ్యత లేదు. ఇది వ్యామోహము, దాస్యచిహ్నము. ఏ దేశములోను తన మాతృభాషను వదలి విదేశీభాషలో ఏ దేశీయులు గృహము లలో మాట్లాడరు. మనది పరప్రభుత్వ పాలనక్రింద నున్న

దేశము గాన మనకీ దాస్య మబ్బినది. దీనినుండి మనము విముక్తి పొందవలయును.

హిందుస్తానీ ఏమంత కష్టమైన భాషకాదు. తేలికగా నేర్చుకొనవచ్చును. దక్షిణ దేశీయులు బుద్ధికుశలత గలవారు, వివేకవంతులున్ను. దక్షిణ దేశీయులు దేశమంతటను వ్యాపించియున్నారు. మీరు విదేశభాషను ఎన్నో సంవత్సరములు కష్టించి నేర్చుకొంటున్నారు. మెట్రిక్యులేషను ప్యాసు కావడానికి 7, 8 సంవత్సరములు కష్టించి చదువవలసి వస్తున్నది. దానినే మనము మన మాతృభాషలో నేర్చుకొన్నచో ఒక రెండు సంవత్సరములలో ప్యాసు కావచ్చును. కనుక ఇంగ్లీషు నేర్చుకొనేకాలములో హిందీ నేర్చుకొనుటకు ఒక అణావంతు వినియోగించినను చక్కగా నేర్చుకొనగలము. ఇందులో ఏమీ సందేహము లేదు. ప్రేమ ఉన్నపుడు, పరిశ్రమ లెక్కలోనికి రాదు. కనుక శ్రద్ధగా ప్రేమతో హిందీ-హిందుస్తానీ నేర్చుకొనవలెనని నేను కోరుచున్నాను.

హిందీ, ఉర్దూ భాషల వివాదము అనవసరము. రెండూ భాషలు ఒకటే. వాడుకలోఉన్న క్రొత్తశబ్దములను గూడ ఈ భాషలో చేర్చుకొనుటకు మనము సందేహించగూడదు. స్థానీయశబ్దములుగూడ మనము భాషలో ప్రయోగింపవచ్చును. ఆంగ్లభాషగూడ, యిట్లే తనలో యితర భాషా శబ్దములను యిముడ్చుకుంటూ ప్రపంచములో సర్వ్వశేష భాషగా రూపొంది ప్రచారమగుచున్నది. మీరు నిజమైన హిందీ ప్రచారకులయినచో మీరు సత్యాహింసా ధర్మము

లను పాలించవలయును. నైతికబలమును సంపాదించవల యును. పవిత్రమైన నిరాడంబర జీవితమును గడపవల యును. ముఖ్యముగ డబ్బు ఎడలను, స్త్రీల యెడలను మీరు పవిత్రులుగా మెలగవలయును. మీవద్ద ఎవరైనా ధన మును దాచినచో దానిని మీరు సురక్షితముగా ఉంచి ఆ సొమ్మును మీరు స్వప్రయోజనమునకై వాడుకొనక, వారు అడిగినపుడు తిరిగి యివ్వవలయును. అటులనే మీవద్దకు చదువుకొనుటకు వచ్చు ఆడపిల్లలయెడల పవిత్రభావముతో మెలగవలయును. ముఖ్యముగా నైతికపతనమునకు కారణ ములు కాంత - కాంచనములే.'' ఈ రెంటియందును హిందీ ప్రచారకులు ప్రమత్తతతో మెలగవలయునని హిందీ ప్రచా రకులను గాంధీజీ ఆదేశించిరి.

**బాపూజీ హిందీ ప్రచారకులతో గోష్ఠి**

30-1-46 ఉదయం హిందీ ప్రచారసభలో పనిచేయు కార్యకర్తలందరు కుటుంబసహితంగా గాంధీజీఉన్న భవనము నకు వెళ్ళితిమి. పదిరోజులనుండి బాపూజీ హిందీ ప్రచార సభలోఉన్నప్పటికిని మమ్ములను కలుసుకొనుటకు బాపూజీకి సమయము లేకుండెను. ఈ సమావేశములో బాపూజీ మా అందరి యోగక్షేమములు అడిగి తెలుసుకొనిరి. ఇప్పుడు నా కుటుంబము మధ్యనున్నట్లు భావించుచున్నానని బాపూజీ అనిరి. హిందీ, హిందుస్తానీ - భాషను దేవనాగరి ఉర్దూ లిపు లలో ప్రచారము చేయవలెనని బాపూజీ చెప్పిరి. ఒక ప్రచా రకుడు రెండు లిపులు నేర్చుకొనుటకంటె రోమన్ లిపిలో

హిందుస్థానీ భాషా ప్రచారము చేయగూడదా' అని ప్రశ్నించెను. మన లిపులు సరిగా లేనిచో వాటిని సంస్కరింపవలెనుగాని రోమను లిపిని స్వీకరించుట మంచిదికాదని బాపూజీ నుడివిరి. రోమనులిపిని స్వీకరించిన మన బానిసత్వమును ప్రదర్శించుకొనుటయే యగు ననెను. దక్షిణదేశములోని ఉత్తరదేశీయ హిందీ ప్రచారకులు దక్షిణదేశపుభాషలను తప్పక నేర్చుకొనవలెనని ఉద్బోధించిరి. రాజకీయపార్టీ విభేదము లెంచక హిందీ నేర్చుకొనువారందరికీ హిందీ తరగతులను పెట్టి మేము హిందీ నేర్పుచుంటిమి. కొందరు కాంగ్రెసువాదులు కమ్యూనిస్టులకు హిందీక్లాసులు పెట్టి హిందీ నేర్పవలదని మమ్ము హెచ్చరించిరి. ఈ విషయమై నేను బాపూజీకి మనవి చేసితిని. కమ్యూనిస్టులకు హిందీ నేర్పగూడదా? యని ప్రశ్నించితిని. అందుకు జాతి, కుల, మత, రాజకీయపార్టీ విభేదము లెంచక హిందీ నేర్చుకో దలచినవారి కందరికీ హిందీ నేర్పుట మీ ధర్మమనియు, లార్డు వేవెల్ - అప్పటి రాజప్రతినిధి - హిందీ నేర్చుకొనదలచినచో నేను వారికి హిందీ బోధించెదననియు బాపూజీ ; విరి. నిర్విరామముగా పనియున్నను బాపూజీ మమ్ముం ప్రత్యేకముగా కలుసుకొని మా యోగక్షేమములు తెలుసుకొని మా సందేహములను తీర్చి మాకు సలహాలిచ్చినందులకు మే మెంతయు సంతసించితిమి.

గాంధీజీ మద్రాసులో నున్నపుడు పార్లమెంటరీ డెలిగేషన్ సభ్యులు, బరంపురం కాంగ్రెసుకార్యకర్తలు, వ్యాపార

మండలి, ఆంధ్రమహిళామండలి సభ్యులు మొదలగువారిని కలుసుకొనిరి.

### తమిళనాడు యాత్ర

గాంధీ స్పెషల్ రైలు 1-2-49 తేదీ రాత్రి మధురకు బయలుదేరెను. దారిలో ఆ రైలు కుంభకోణం, చిదంబరం, తంజావూరు, తిరుచిరపల్లి మొదలగు స్టేషనులలో ఆగెను. ఆ స్టేషనులకు అశేషజనంవచ్చి మహాత్ముని దర్శనం చేసుకొని వారికి హరిజననిధికి విరాళములొసగిరి.

హరిజనులకు దేవాలయములోనికి వెళ్ళి భగవంతుని దర్శనము చేసికొనుటకు అవకాశములేని దేవాలయములకు తానూ వెళ్ళనని మహాత్మాజీ ప్రతిన పూనెను. ఇపుడు మధురలోనున్న ప్రసిద్ధ మీనాక్షి దేవాలయమును, పళనిలోనున్న సుబ్రహ్మణ్య దేవాలయమున్నూ హరిజనులకు గూడ తెరువబడినవి. కనుక మహాత్మాజీ ఆ దేవాలయములను దర్శించెను.

దక్షిణదేశములో 1949 సం. లో గాంధీజీచేసిన చివరి పర్యటన ముఖ్యముగా హిందీ ప్రచారమునకు, హరిజనోద్ధరణకు మాత్రమే ఉద్దేశింపబడినది. ఈ యాత్రను ముగించుకొని 4-2-46వ తేదీ రాత్రి ఏడున్నర గంటలకు ఆ స్పెషలు రైలులోనే గాంధీజీ తన వెంటవచ్చిన పరివారంతోసహా మద్రాసుకు బయలుదేరిరి.

# 22

## విజయవాడలో సభ

ప్రత్యేక రైలు బెజవాడ స్టేషనుకు ది 5-2-46 తేది ఉదయం 5-45 గంటలకు చేరినది. గాంధీ మహాత్ముని దర్శించుటకు, వారి ఉపన్యాసమును వినుటకు వీలుగా ప్రత్యేకమైన వేదిక ఏర్పాటు చేయబడినది. సుమారు 50 వేలమంది జనం గాంధీజీ దర్శనార్థమై వచ్చారు. గాంధీజీ రైలు దిగగానే ఆంధ్ర రాష్ట్ర హిందీప్రచారసభ కార్యదర్శినగు నేను వారిని పుష్పమాలాలంకృతులను చేసితిని. విజయవాడలో హిందుస్తానీ భవన నిర్మాణానికిగాను తేబడిన పునాదిరాతికి గాంధీజీ పూజచేసి ఆశీర్వదించారు.

గాంధీజీ ఉపన్యసించుటకు వేదికపై రాగానే శ్రీ యెర్నేని సుబ్రహ్మణ్యముగారు గాంధీజీకి ఒక చీటిని యిచ్చిరి. ఆ చీటీలో గాంధీజీ దక్షిణదేశము రావటానికి ఉద్దేశ్యము రాజాజీని ప్రధాని చేయటానికి అని యిక్కడి ప్రజలు భావించుచున్నారని వ్రాసిరి. ఆ చీటీ చదువుకొని గాంధీజీ యిట్లుపన్యసించిరి:

"కాంగ్రెసువారు కూడా నా మద్రాసు ప్రయాణం రాజాజీని ప్రధానమంత్రిని చేయటానికేమోనని శంకించటం నాకు చాలా విచారాన్ని కలుగజేస్తున్నది. నేను ప్రత్యేకంగా రాజాజీని మద్రాసు రాష్ట్ర ప్రధానిని చేయటానికని యీ ప్రయాణం చేశానన్న దురభిప్రాయాన్ని బలపరుస్తూ తెలుగు పత్రికలు ప్రచారం చేసినవి. నేనిది కలలో గూడ

ఊహింపలేదు. నేను జెయిలునుండి విడుదల అయినప్పటినుండి హిందుస్తానీ ప్రచారం నిమిత్తం దక్షిణభారత హిందీప్రచార సభ రజతజయంతి ఉత్సవాలలో పాల్గొనేనిమిత్తం మద్రాసు వెళ్ళటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాను. నేను దక్షిణభారత హిందీప్రచారసభ అధ్యక్షుని హోదాలోనే మద్రాసువెళ్ళేను. కాని మరియే యితర పనికి, యే హోదాలోను వెళ్ళలేదు.

"రాజగోపాలాచారిని గురించి నన్ను మాట్లాడమని యెందరో కోరారు. నేనందుకొప్పుకోలేదు. ఎందరో ఉత్తరాలు వ్రాశారు. నేను వారికి సమాధానం వ్రాయలేదు. అందులకు కారణం నేను కాంగ్రెసులో పావలా సభ్యుడను గూడ కాకపోవటమే. రాజాజీ నాకు బాల్యమిత్రుడు. ఆయన మేధాశక్తిలో నాకు విశ్వాసముంది. ప్రధాని పదవికి అతడు అర్హుడు. కాని రాజాజీని ప్రధానిని చేయటము, నేను స్వయముగా ప్రధానిని కావటమూ నా చేతిలోని పనికాదు. రాష్ట్రీయ కాంగ్రెసు సంఘమూ, అఖిల భారత కాంగ్రెసు సంఘమూ మాత్రమే అట్టికార్యాచరణకు అర్హతగలవి. ఎన్నికలలోను పార్లమెంటరీ కార్యక్రమంలోనూ నాకు అభిమానంలేదు. నేనింతవరకూ రహస్యంగా ఏ కార్యమూ చేసియెరుగను. ఇకముందు చెయ్యదలచుకోలేదు. బెజవాడచేరిన తరువాతనే నాకీ విషయము తెలిసినది. నేనది యింతవరకు ఊహించే అవకాశంగూడ లభించలేదు. రాజాజీనే ప్రధానిగా చేతామన్న అభిప్రాయం నాకు కలిగిఉంటే యింతదూరం రాకుండానే కదలకుండానే నేను ఆ పనిని చేయగలిగేవాడిని.

నేను ఈ విషయంలో మౌనంవహించదలచాను. జోక్యం కలిగించుకోవద్దనుకొన్నాను."

తదుపరి గాంధీజీ హిందీప్రచార ఆవశ్యకతను గురించి అందరిని మాతృభాషతోపాటు హిందుస్తానీని తప్పక నేర్చుకొనవలసినదిగా ఉద్బోధించారు. ఇంగ్లీషు భాషాప్రచారం వల్లను, ఇంగ్లీషు వ్యామోహమువల్లను మన దేశభాషలు, వృద్ధిచెందలేదనియు ఇంగ్లీషు భాషా వ్యామోహమునువీడి మాతృభాషను జాతీయభాషను వృద్ధిపరచవలసినదిగా కోరిరి.

నేనుగాంధీజీ ఉపన్యాసమును తెలుగున అనువదించితిని. తదుపరి రైలు 9-15 గంటలకు బయలుదేరెను. శ్రీ మొర్నేని లక్ష్మీనారాయణగారు గాంధీజీ బృందమునకు కావలసిన పండ్లు, ఫలహారములు సప్లయి చేసిరి. దారిలో ఖమ్మం వద్ద, కాజీపేట రైలు స్టేషనువద్ద గొప్పసభలు జరిగినవి. ఆ సభలలో మహాత్మునికి హరిజననిధికి, హిందీ ప్రచారనిధికి గాను కానుకలు సమర్పించిరి. మహాత్మాగాంధీగారు హిందీ ప్రచార ఆవశ్యకత, హరిజనోద్ధరణ, మద్యపాననిషేధం, హిందూమహమ్మదీయఐక్యత మున్నగు విషయములను గురించి ఉపన్యసించిరి.

**బాపూజీ నియమపాలన**

మహాత్మాగాంధీజీ ప్రయాణంచేస్తున్న యీ స్పెషలు రైలుకు ఒక మొదటి తరగతిపెట్టె గూడ ఉన్నది. ఆపెట్టెలో మహాత్ముని కుమారుడు మణిలాల్ గాంధి వగైరాలు ప్రయాణిస్తున్నారు. గాంధీజీ మూడవ తరగతి బోగీలో స్నానానికి

నీళ్ళులేవు. గాంధీజీ స్నానము చేయవలసియున్నది. కాని నీళ్ళులేవు. అపుడు గాంధీజీ దగ్గరనేఉన్న శ్రీమతి రాజ కుమారి అమృతకౌర్ గారు బాపూజీతో మొదటి తరగతి పెట్టెలోకి వెళ్ళి స్నానము చేయవలసినదిగా మనవిచేశారు. అప్పుడు వెంటనే బాపూజీ "మొదటి తరగతి పెట్టెలోకివెళ్ళి స్నానంచేసేబదులు ఆపెట్టెలోనే ప్రయాణం చేయవచ్చుగా?" అని సమాధానం చెప్పారు. తరువాత మూడవ తరగతి పెట్టె లోనే స్నానానికి ఏర్పాట్లు చేయబడినవి.

# 23

## కాజీపేటలోయిచ్చిన సందేశము

ఈ ప్రయాణంలో నేను గాంధీజీతోపాటు కాజీపేట వరకు ప్రయాణంచేశాను. కాజీపేట రైలుస్టేషనువద్దకు అశేష జనం మహాత్ముని దర్శనార్థమై వచ్చారు. అక్కడ రైలు పెట్టెలోనే గుమ్మందగ్గర నిల్చొని మద్యపాననిషేధము, హిందూ-మహమ్మదీయ ఐక్యత, హరిజనోద్ధరణ, హిందు స్తానీ ప్రచారంగూర్చి 15-20 నిమిషాలు ఉపన్యసించారు. తరువాత నేను వారినుండి సెలవు పుచ్చుకొంటూ ఆంధ్ర దేశమునకు సందేశ మివ్వవలసినదిగా కోరితిని.

అప్పుడు వెంటనే నేను యిచ్చిన కాగితంపై స్వదస్తూ రీలో ఈ క్రింది సందేశమును వ్రాసి నా చేతికిచ్చిరి. వారికి నమస్కరించి నేను సెలవుపుచ్చుకొంటిని.

కాజీపేట్
8-2-46

ఆంధ్రదేశ్ మేఁ మైఁ బహుత్ ఆశా రఖ్‌తా హూఁ। మేరీ ఉమ్మీద్ హై కి మేరీ ఆశా ఆంధ్రదేశ్ పూర్ణ కరేగా। ఆశా యహ్ హై। అస్పృశ్యతా సర్వదా దూర్ కర్‌నా, సబ్ మందిర్ ఖోల్‌నా। సబ్ జగహ్ చరఖా చలే ఔర్ సబ్ ఖద్దర్ హీ పహనే, కౌమీ ఐక్యబనే। మాతృభాషా ఔర్ రాష్ట్ర భాషా హిందుస్తానీ కా నాగరీ ఔర్ ఉర్దూ లిపి మేఁ ప్రగతి కరేఁ ।

ఆంధ్రదేశమునుండి నేను చాలా ఆశించుచున్నాను. ఆంధ్రదేశము నా ఆశయములను తప్పక నెరవేర్చునని నా పూర్ణవిశ్వాసము.

అస్పృశ్యతను పూర్తిగా పోగొట్టవలెను. దేవాలయములన్నింటిలోను హరిజనులకు ప్రవేశమొసంగవలెను. అన్నిచోట్ల రాట్నము తిరుగవలెను. అందరును ఖాదీనే ధరించవలెను. మాతృభాషను అభ్యసించవలెను. దేవనాగరి, ఉర్దు లిపులతో కూడిన జాతీయ భాషయగు హిందుస్తానీ యెడ మక్కువ చూపవలెను.

మో. క. గాంధి



